# వీచికేది

## కవితా సంకలనం *


కృష్ణమూర్తి

చక్రవర్తి

వెంకట్రావు

విశ్వనాథం



యువభారతి

[ రిజిష్టర్డు నెం. 1/64 ]

సాహితీ సాంస్కృతిక సంస్థ

5, కింగ్సువే, సికింద్రాబాదు.

# వీచికలు

కవితా సంకలనం*

కృష్ణమూర్తి

చక్రవర్తి

వెంకట్రావు

విశ్వనాథం

యువభారతి

[ రిజిష్టర్డు నెం. 1/64 ]

సాహితీ సాంస్కృతిక సంస్థ

5, కింగ్సువే, సికింద్రాబాదు.

VEECHIKALU :
KAVITHA SANKALANAM.

యువభారతి ప్రచురణ — 3.

ముఖచిత్రం : వెంకట్రావు

ప్రథమ ముద్రణ

OCT 1968

1,000 ప్రతులు

ప్రచురణ :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు.

ముద్రణ :

శ్రీరామా పవర్ ప్రెస్,

సికింద్రాబాదు.

వెల : రూపాయి.

**VEECHIKALU :**
**KAVITHA SANKALANAM.**

యువభారతి ప్రచురణ — 3.

ముఖచిత్రం : వెంకట్రావు

ప్రథమ ముద్రణ
OCT 1968
1,000 ప్రతులు

ప్రచురణ :

యువభారతి

5, కింగ్సువే, సికింద్రాబాదు.

ముద్రణ :

శ్రీరామా పవర్ ప్రెస్,
సికింద్రాబాదు.

వెల : రూపాయి.




# మనవి మాటలు

యువభారతి సంస్థలోని నలుగురు సభ్యుల రచనలను, "వీచికలు" అనే కవితా సంకలనంగా తెలుగు పఠితృలోకానికి సమర్పించుకోగలుగుతున్నందుకు మా కెంతో సంతోషంగావుంది.

ఐదవ వార్షికోత్సవ సందర్భంగా అందచేస్తున్న ఈ "వీచికలు" యువభారతి మూడవ ప్రచురణ. ఇంతకుమునుపు శ్రీ అనుమల కృష్ణమూర్తి గారి 'సరస్వతీ సాక్షాత్కారము' అను కావ్యఖండికను మొదటి ప్రచురణగాను, శ్రీ కాళోజీగారి జీవనగీత (ఖలీల్ జిబ్రాన్ ది ప్రాఫెట్‌కు తెనుగు సేత) ద్వితీయ ప్రచురణగాను అందజేసినాము. యువభారతి కేవలం ఒక ప్రచురణ సంస్థకాదు. యువకులలో ఆలోచనాశక్తిని, వచఃశక్తిని, రచనాశక్తిని అంకురింపజేసి వారిలోని సృజనాత్మకశక్తిని నిర్మాణ కార్య కలాపాలవైపునకు మళ్ళించడానికి గత అయిదేండ్లనుంచి కృషిచేస్తున్న సంస్థ యిది.

యువభారతి పక్షాన మేము పక్షసమావేశాలు జరుపుతూ, యువకులలో ఉత్తమ సాహిత్యాభిరుచిని యినుమడింప జేయడానికి ప్రయత్నిస్తున్నాము.




# మనవి మాటలు

యువభారతి సంస్థలోని నలుగురు సభ్యుల రచనలను, "వీచికలు" అనే కవితా సంకలనంగా తెలుగు పఠితృలోకానికి సమర్పించుకోగలుగు తున్నందుకు మా కెంతో సంతోషంగావుంది.

ఐదవ వార్షికోత్సవ సందర్భంగా అందచేస్తున్న ఈ "వీచికలు" యువభారతి మూడవ ప్రచురణ. ఇంతకుమునుపు శ్రీ అనుమల కృష్ణమూర్తి గారి 'సరస్వతీ సాక్షాత్కారము' అను కావ్యఖండికను మొదటి ప్రచురణ గాను, శ్రీ కాళోజీగారి జీవనగీత (ఖలీల్ జిబ్రాన్ ది ప్రాఫెట్‌కు తెనుగు సేత) ద్వితీయ ప్రచురణగాను అంద జేసినాము. యువభారతి కేవలం ఒక ప్రచురణ సంస్థకాదు. యువకులలో ఆలోచనా శక్తిని, వచః శక్తిని, రచనా శక్తిని అంకురింపజేసి వారిలోని సృజనాత్మకశక్తిని నిర్మాణ కార్య కలాపాలవైపునకు మళ్ళించడానికి గత అయిదేండ్లనుంచి కృషిచేస్తున్న సంస్థ యిది.

యువభారతి పక్షాన మేము పక్షసమావేశాలు జరుపుతూ, యువకులలో ఉత్తమ సాహిత్యాభిరుచిని యినుమడింప జేయడానికి ప్రయత్నిస్తున్నాము.

గ్రంథ ప్రచురణకు పూనుకోవడానికి ఈ సంస్థ ధనాఢ్యమైనదికాదు. ఈ నలుగురు రచయితలూ అంద జేసిన కొంత ఆర్థిక సహాయం చేయూతగా **యువభారతి** "వీచికలు" వెలువరించగలిగింది.

ఈ నలుగురి భావాలలో, భావప్రకటనారీతిలో వైవిధ్యం వున్నది. ఈ నలుగురినీ ఏకం చేసింది, **యువభారతి** సాహిత్య కార్యకలాపాలు. "ఊహించే మేథ, స్పందించగల హృదయం, రాటుదేరిన కలం కవికుండాల్సిన లక్షణాలలో ముఖ్యం" అన్నాడు దాశరథి. మొదటి రెండు లక్షణాలూ ఈ నలుగురిలో వున్నాయని మా నమ్మకం. ఎటొచ్చీ రాటు దేరిన కలం సంగతి - అభ్యస్తమయిన కళ అందంగానూ వుంటుంది, శక్తి వంతంగానూ వుంటుంది. ఈ రచయితలు సాధన చేస్తున్నారు. ఇందులో కొన్ని రచనలు పత్రికలలో ప్రచురితమయినవే. ఉత్తమ సాహితీ ప్రాంగణం లోకి ప్రవేశించాలనే కుతూహలంతో "వీచికలు" కవులుగా కూడారు. అనుభవము బలపడుతున్నకొద్దీ, పాండిత్యం పుంజుకొంటున్నకొద్దీ రచనాశక్తిలో మరింత నైపుణ్యం రాగలదన్న ఈ రచయితల ఆశయమే **యువభారతి** ఆశయం.

ముఖచిత్రానికి రూపకల్పనచేసి చిత్రించినది శ్రీ అల్లంరాజు వెంకట్రావు అటు కలాన్ని, ఇటు కుంచెను సమర్థవంతంగా నడపగలిగే వీరి నైపుణ్యాన్ని **యువభారతి** మరువదు.

నిర్ణయించిన గడువులో అందంగా అచ్చొత్తి యిచ్చిన శ్రీరామా పవర్ ప్రెస్ అధినేత శ్రీ పబ్బా శంకరయ్యగారికి **యువభారతి** నమస్సులు.

సహృదయులయిన మీ సహకార ఔదర్యాలతో ముందుకు సాగదలుచుకొంటున్న —

**యువభారతి**

గ్రంథ ప్రచురణకు పూనుకోనడానికి ఈ సంస్థ ధనాఢ్యమైనదికాదు. ఈ నలుగురు రచయితలూ అందజేసిన కొంత ఆర్థిక సహాయం చేయూతగా యువభారతి "వీచికలు" వెలువరించగలిగింది.

ఈ నలుగురి భావాలలో, భావప్రకటనారీతిలో వైవిధ్యం వున్నది. ఈ నలుగురినీ ఏకం చేసింది, యువభారతి సాహిత్య కార్యకలాపాలు. "ఊహించే మేధ, స్పందించగల హృదయం, రాటుదేరిన కలం కవికుండాల్సిన లక్షణాలలో ముఖ్యం" అన్నాడు దాశరథి. మొదటి రెండు లక్షణాలూ ఈ నలుగురిలో వున్నాయని మా నమ్మకం. ఎటొచ్చీ రాటు దేరిన కలం సంగతి - అభ్యస్థమయిన కళ అందంగానూ వుంటుంది, శక్తి వంతంగానూ వుంటుంది. ఈ రచయితలు సాధన చేస్తున్నారు. ఇందులో కొన్ని రచనలు పత్రికలలో ప్రచురితమయినవే. ఉత్తమ సాహితీ ప్రాంగణం లోకి ప్రవేశించాలనే కుతూహలంతో "వీచికలు" కవులుగా కూడారు. అనుభవము బలపడుతున్నకొద్దీ, పాండిత్యం పుంజుకొంటున్నకొద్దీ రచనాశక్తిలో మరింత నైపుణ్యం రాగలదన్న ఈ రచయితల ఆశయమే యువభారతి ఆశయం.

ముఖచిత్రానికి రూపకల్పనచేసి చిత్రించినది శ్రీ అల్లంరాజు వెంకట్రావు అటు కలాన్ని, ఇటు కుంచెను సమర్థవంతంగా నడపగలిగే వీరి నైపుణ్యాన్ని యువభారతి మరువదు.

నిర్ణయించిన గడువులో అందంగా అచ్చొత్తి యిచ్చిన శ్రీరామా పవర్ ప్రెస్ అధినేత శ్రీ పబ్బా శంకరయ్యగారికి యువభారతి నమస్సులు.

సహృదయులయిన మీ సహకార ఔదర్యాలతో ముందుకు సాగదలుచుకొంటున్న —

యువభారతి

# ఇరివెంటి కృష్ణమూర్తి

జననం : జూలై 12, 1930 మహబూబునగరంలో. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎం. ఎ. తెలుగు పట్టభద్రులు. హైదరాబాదు సాయం కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. హిందీ, ఉర్దూ భాషా సాహిత్యాలతో సన్నిహితపరిచయం వుంది. మహబూబ్‌నగర్ జిల్లా మాండలిక భాషలో కొన్ని కథలు ప్రచురించారు. కొన్ని గేయాలు, వ్యాసాలుకూడా ప్రచురితమయ్యాయి.

"పొటమరించే తలపులనేకం. వాటిలో ఇతరులకు చెప్పదలచుకొన్నవి ఏ కొంచెమో ? చెప్పే తీరులో అందముందో లేదో వినేవారే చెప్పాలి. నేను చెప్పుకోకూడదు. అయితే అనుకున్నవి అనగల్గడం సాధ్యం కాకపోవచ్చు. ఈ నా తలపోతలు మీకు నచ్చితీరాలని కాదు. నచ్చితే సంతోషమే !"

— కృష్ణమూర్తి.

# ఇరివెంటి కృష్ణమూర్తి

జననం : జూలై 12, 1930 మహబూబునగరంలో. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎం. ఎ. తెలుగు పట్టభద్రులు. హైదరాబాదు సాయం కళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. హిందీ, ఉర్దూ భాషా సాహిత్యాలతో సన్నిహితపరిచయం వుంది. మహబూబ్‌నగర్ జిల్లా మాండలిక భాషలో కొన్ని కథలు ప్రచురించారు. కొన్ని గేయాలు, వ్యాసాలుకూడా ప్రచురితమయ్యాయి.

"పొటమరించే తలపులనేకం. వాటిలో ఇతరులకు చెప్పదలచుకొన్నవి ఏ కొంచెమో ? చెప్పే తీరులో అందముందో లేదో వినేవారే చెప్పాలి. నేను చెప్పుకోకూడదు. అయితే అనుకున్నవి అనగల్గడం సాధ్యం కాకపోవచ్చు. ఈ నా తలపోతలు మీకు నచ్చితీరాలని కాదు. నచ్చితే సంతోషమే !"

— కృష్ణమూర్తి.

# ఆయనొకడున్నాడు!

ఆయన్ని వ్రాయనీయండి.
ఆయన వ్రాసిందేదో చదవండి.
ఓహో! ఆహో! అనండి.

ఆయన నూటికంటే ఎక్కువేరాశాడు.
శతాధికగ్రంధకర్త అనడంకంటే,
శకటాధికగ్రంధకర్త అనడం సబబు.
కథలూ, కావ్యాలూ, ఉత్తరాలూ
సన్మాన పత్రికలూ, పీఠికలూ, అభిప్రాయాలూ వ్రాసాడు.
ఆయన చెప్పింది అవుననడానికి యోగ్యత అనవసరం.
కాదని చెప్పడానికి, సమకాలీనుల్లో ఎవ్వరికీ యోగ్యత లేదని
ఆయన దృఢవిశ్వాసం.

ఆయనతో మైత్రికావాలంటే
ఆయనవి కొన్ని నియమాలు.
ఆయన కులంవాడై ఉండాలె.
ఆయనకు చేసిన సన్మాన సభలకు హాజరుకావాలె.
ఆయనవలెనే నడవాలె, ఆయనవలెనే మాట్లాడాలె.
ఆయన తరుచుగా తిట్టే తిట్లే తిట్టాలె,
ఆయన ఏడ్చినప్పుడు ఏడ్వాలె, నవ్వినప్పుడు నవ్వాలె.
రాజాశ్రితులుగా వుండదలచినవారు,
చేసే తతంగాలన్నీ చేయాలె,
రాజాధిరాజులకుండే బిరుదులన్నీ ఆయనకున్నాయి కనుక.
ఆయనవంటి వాడొకడుండెననీ. ఉన్నాడనీ, ఉండవచ్చనీ,
ఉండగలడనీ అనగూడదు.
ఆయనకు కొన్ని మనోవ్యథలున్నాయి.
కవిగా తనకు వచ్చిన ఖ్యాతి, రాజకీయవేత్తగా రాలేదని.
శాపానుగ్రహదక్షత, వెనుకటి కొందరి కవులవలె తనకులేదని.
ఇంకో బాధ—
తనను ఇప్పుడు చాలామంది చదువుతున్నారని.

## ఆయనొకడున్నాడు!

ఆయన్ని వ్రాయనీయండి.
ఆయన వ్రాసిందేదో చదవండి.
ఓహో! ఆహో! అనండి.

ఆయన నూటికంటే ఎక్కువేరాశాడు.
శతాధికగ్రంధకర్త అనడంకంటే,
శకటాధికగ్రంధకర్త అనడం సబబు.
కధలూ, కావ్యాలూ, ఉత్తరాలూ
సన్మాన పత్రికలూ, పీఠికలూ, అభిప్రాయాలూ వ్రాసాడు.
ఆయన చెప్పింది అవుననడానికి యోగ్యత అనవసరం.
కాదని చెప్పడానికి, సమకాలీనుల్లో ఎవ్వరికీ యోగ్యత లేదని
ఆయన దృఢవిశ్వాసం.

ఆయనతో మైత్రికావాలంటే
ఆయనవి కొన్ని నియమాలు.
ఆయన కులంవాడై ఉండాలె.
ఆయనకు చేసిన సన్మాన సభలకు హాజరుకావాలె.
ఆయనవలెనే నడవాలె, ఆయనవలెనే మాట్లాడాలె.
ఆయన తరుచుగా తిట్టే తిట్లే తిట్టాలె,
ఆయన ఏడ్చినప్పుడు ఏడ్వాలె, నవ్వినప్పుడు నవ్వాలె.
రాజాశ్రితులుగా వుండదలచినవారు,
చేసే తతంగాలన్నీ చేయాలె,
రాజాధిరాజులకుండే బిరుదులన్నీ ఆయనకున్నాయి కనుక.
ఆయనవంటి వాడొకడుండెననీ. ఉన్నాడనీ, ఉండవచ్చనీ,
ఉండగలడనీ అనగూడదు.
ఆయనకు కొన్ని మనోవ్యథలున్నాయి.
కవిగా తనకు వచ్చిన ఖ్యాతి, రాజకీయవేత్తగా రాలేదని.
శాపానుగ్రహదక్షత, వెనుకటి కొందరి కవులవలె తనకులేదని.
ఇంకో బాధ—
తనను ఇప్పుడు చాలామంది చదువుతున్నారని.

అచ్చుయంత్రం పుణ్యమా యని
ప్రతివాడిచేతికీ అందుతున్నాయట పుస్తకాలు.
గిట్టని వాళ్ళచేతుల్లోకి పోతున్నాయట.
వాళ్ళు అవాకులూ, చెవాకులూ పేలుతున్నారట.
అలనాటి తాళపత్రాలకాలం భేషైన కాలమట.
కవివద్ద, అంకితం పొందినవాడివద్ద,
కవిని అందలాలు ఎక్కించిన వారివద్ద మాత్రమే వుండిపోయేవి మరి.
అందరూ చదివి పారేస్తున్నారని, ఆయన గొణుగుతుంటాడు.
ఖర్చుల కెళ్ళక, పొట్లాలవాడి కమ్మితే,
మర్నాడవి పేవ్‌మెంట్లపై ప్రత్యక్షమౌతున్నవి.
ఆయన ముందరే, ఎవరోవచ్చి, నయాపైసలకు బేరమాడుతోంటే,
తననే నిలువునా చీల్చినట్లుగా, వేలంపాడినట్లుగా అనిపించిదట.
తానొక్కడే ఉన్నట్టుగా తలపోసి,
'ఏమికాలం ?' అని వాపోయాడట.
ఆ ప్రక్కనే ఎందుకో నించున్న కుర్రాడు,
వాడూ కవో ఏం పాడో
'సాయంకాలం' అని ఇగిలించాడట.

స్వాతంత్ర్యం వచ్చాక, ఆయన్నింకో బాధపీడిస్తున్నది.
చాలామంది ప్రఖ్యాతులౌతున్నారని.
తనతో సమానంగా సన్మానాలు పొందుతున్నారని.
అందరూ సమ్మానితులౌతే, తన సన్మానానికేమిటి అర్థం ?
ఇదే ప్రజాస్వామ్యంలోని గొప్ప లోపమట.
అందుకే ఆయనకు, ప్రజాస్వామ్యం అంటేగిట్టదు.
ఎవడో ఒక సార్వభౌముడుండాలె.
అతడు తనను కవి అనాలె,
సార్వభౌముడు లేడు; తాననుకొనేగౌరవం తనకు లేదు.
కనుక, తనకు జరుగుతున్న సన్మానాలు, తనకు తృప్తినివ్వడం లేదు.
శాలువలూ, వుంగరాలూ, గండపెండేరాలూ, పూలహారాలూ,
సన్మానపత్రాలూ, పత్రికల్లో సన్మాన సభావార్తలు,
అన్నీ నిరర్థకాలే - రాజొకడు చేయనప్పుడు.

అచ్చుయంత్రం పుణ్యమా యని
ప్రతివాడిచేతికీ అందుతున్నాయట పుస్తకాలు.
గిట్టని వాళ్ళచేతుల్లోకి పోతున్నాయట.
వాళ్ళు అవాకులూ, చెవాకులూ పేలుతున్నారట.
అలనాటి తాళపత్రాలకాలం భేషైన కాలమట.
కవివద్ద, అంకితం పొందినవాడివద్ద,
కవిని అందలాలు ఎక్కించిన వారివద్ద మాత్రమే వుండిపోయేవి మరి.
అందరూ చదివి పారేస్తున్నారని, ఆయన గొణుగుతుంటాడు.
ఖర్చుల కెళ్ళక, పొట్లాలవాడి కమ్మితే,
మర్నాడవి పేవ్‌మెంట్లపై ప్రత్యక్షమౌతున్నవి.
ఆయన ముందరే, ఎవరోవచ్చి, నయాపైసలకు బేరమాడుతోంటే,
తననే నిలువునా చీల్చినట్లుగా, వేలంపాడినట్లుగా అనిపించిదట.
తానొక్కడే ఉన్నట్టుగా తలపోసి,
'ఏమికాలం ?' అని వాపోయాడట.
ఆ ప్రక్కనే ఎందుకో నించున్న కుర్రాడు,
వాడూ కవో ఏం పాడో
'సాయంకాలం' అని ఇగిలించాడట.

స్వాతంత్ర్యం వచ్చాక, ఆయన్నింకో బాధపీడిస్తున్నది.
చాలామంది ప్రఖ్యాతులౌతున్నారని.
తనతో సమానంగా సన్మానాలు పొందుతున్నారని.
అందరూ సమ్మానితులౌతే, తన సన్మానానికేమిటి అర్థం ?
ఇదే ప్రజాస్వామ్యంలోని గొప్ప లోపమట.
అందుకే ఆయనకు, ప్రజాస్వామ్యం అంటేగిట్టదు.
ఎవడో ఒక సార్వభౌముడుండాలె.
అతడు తనను కవి అనాలె,
సార్వభౌముడు లేదు; తాననుకొనేగౌరవం తనకు లేదు.
కనుక, తనకు జరుగుతున్న సన్మానాలు, తనకు తృప్తినివ్వడం లేదు.
శాలువలూ, వుంగరాలూ, గండపెండేరాలూ, పూలహారాలూ,
సన్మానపత్రాలూ, పత్రికల్లో సన్మాన సభావార్తలు,
అన్నీ నిరర్థకాలే – రాజొకడు చేయనప్పుడు.

మొన్న బస్సులో వస్తున్నాడట.
అంతా చదువుకున్నవాళ్ళున్నారట.
తనను గుర్తించనే లేదట.
రైల్లోనూ అంతే అయిందట.
గుడిలో ప్రసాదంకూడా, చివరికే దొరికిందట.
శిలావిగ్రహం లేకపోతేమానె, కాంస్యవిగ్రహం లేకపోతేమానె,
కనీసం సిమెంటు విగ్రహమైనా,
తనది దేశంలో ఎక్కడా లేకపోవడం –
తాను చవటలంటున్నవాళ్ళ విగ్రహాలు,
నిలువెత్తుగా కొట్టవస్తున్నట్టు, ప్రతి శృంగాటకంలోనూ ప్రత్యక్షమవటం
చీకాకు పరుస్తున్నవాయన్ని.
ఆయన 'కేకలవ్య శిష్యులం' అని చెప్పుకొని తిరిగేవాళ్ళుకూడా
ఈ విషయంలో పూనుకోకపోవడంలోని, అంతరార్థం తెలిసిందికాదు.
వాళ్ళ గుండెల్లోకి దూరడానికి చేసిన ప్రయత్నాలన్నీ అడ్డం తిరిగినవి.
అసలు ప్రాక్టికల్‌గా ఆయన కవిత్వం ఫేలైందిక్కడే.
కాని,
ఒకటి రెండుసార్లు, ఆయన కవిత్వం చలింపచేసిందట.
ఫలించిందట.
ఒకసారి,
తానొక ఎమ్మెల్యే జీవితాన్ని, కావ్యంగా మలచి,
తనభార్య కంకితమిచ్చాడట.
తనవంటి ప్రతిభామూర్తికి భార్య కాగలగడం, ఆమె అదృష్టం అనీ
ఆ భాగ్యం. అలనాటి దమయంత్యాదులకూ,
ఈనాటి ఏ ఆవిడకూ లేదని, అర్థంవచ్చే అవతారిక వ్రాశాడట.
ఊళ్ళోని ఆడవాళ్ళు ముక్కుమీద వేలువేసుకున్నారట.
భర్తలతో అదోలా మాట్లాడారట.
ఆ భాగ్యవంతురాలిని చూసి, మిటికెళ్ళు విరిచారట.
మూతులు తిప్పుకొన్నారట.
కావ్యం అచ్చై, ఆవిష్కరింపబడ్డాక,
ఆ పుటనుమాత్రం తీసి, అద్దం గట్టించి, వ్రేలాడగట్టింది.
కవిగారి కేదో సభలో, 'ఇటీవలి కాళిదాసు' అని,

# గంగిశెట్టి లక్ష్మీనారాయణ

మొన్న బస్సులో వస్తున్నాడట.
అంతా చదువుకున్నవాళ్ళున్నారట.
తనను గుర్తించనే లేదట.
రైల్లోనూ అంతే అయిందట.
గుడిలో ప్రసాదంకూడా, చివరికే దొరికిందట.
శిలావిగ్రహం లేకపోతేమానె, కాంస్యవిగ్రహం లేకపోతేమానె,
కనీసం సిమెంటు విగ్రహమైనా,
తనది దేశంలో ఎక్కడా లేకపోవడం –
తాను చవటలంటున్నవాళ్ళ విగ్రహాలు,
నిలువెత్తుగా కొట్టవస్తున్నట్టు, ప్రతి శృంగాటకంలోనూ ప్రత్యక్షమవటం
చీకాకు పరుస్తున్నవాయన్ని.
ఆయన 'కేకలవ్య శిష్యులం' అని చెప్పుకొని తిరిగేవాళ్ళుకూడా
ఈ విషయంలో పూనుకోకపోవడంలోని, అంతరార్థం తెలిసిందికాదు.
వాళ్ళ గుండెల్లోకి దూరడానికి చేసిన ప్రయత్నాలన్నీ అడ్డం తిరిగినవి.
అసలు ప్రాక్టికల్‌గా ఆయన కవిత్వం ఫేలైందిక్కడే.
కాని,
ఒకటి రెండుసార్లు, ఆయన కవిత్వం చలింపచేసిందట.
ఫలించిందట.
ఒకసారి,
తానొక ఎమ్మెల్యే జీవితాన్ని, కావ్యంగా మలచి,
తనభార్య కంకితమిచ్చాడట.
తనవంటి ప్రతిభామూర్తికి భార్యకాగలగడం, ఆమె అదృష్టం అనీ
ఆ భాగ్యం. అలనాటి దమయంత్యాదులకూ,
ఈనాటి ఏ ఆవిడకూ లేదని, అర్థంవచ్చే అవతారిక వ్రాశాడట.
ఊళ్ళోని ఆడవాళ్ళు ముక్కుమీద వేలువేసుకున్నారట.
భర్తలతో అదోలా మాట్లాడారట.
ఆ భాగ్యవంతురాలిని చూసి, మిటికిళ్ళు విరిచారట.
మూతులు తిప్పుకొన్నారట.
కావ్యం అచ్చై, ఆవిష్కరింపబడ్డాక,
ఆ పుటనుమాత్రం తీసి, అద్దం గట్టించి, వ్రేలాడగట్టింది.
కవిగారి కేదో సభలో, 'ఇటీవలి కాళిదాసు' అని,

బిరుదుప్రదానం చేసి, ఇచ్చిన సన్మానపత్రాన్ని అద్దంలోంచి తీసి,
అంకితం పేజీనిపెట్టింది.
సన్మాన పత్రాలను, పూజాద్రవ్యాలుగా భావించే కవిగారు
కాలుగాలిన పిల్లి అవతారం దాల్చారు;
విలయతాండవం చేశారు.
ఆ సన్మానపత్రాలు, తన అహంతాప్రతిభలకెత్తిన వైజయంతికలు మరి.
ఫలితం, రాత్రి భోజనంలేదు.
మరోసారి –
ఏదో జవుళిదుకాణాన్ని ప్రారంభించడానికి,
ఎవరో అమాత్యవృషభులేతెంచినపుడు,
తాను చదివిన పంచరత్నశంఖారావానికి,
శ్రీవారు శిరః కంపనజేసి,
చిర్నగవులను తొలికానుకగా ఇచ్చుకున్నారట.
మరికొంతకాలానికి, కవిగారి ఒక కృతి పాఠ్యపుస్తకమైంది.
ఇది మంత్రిగారి మలికానుకని జనశ్రుతి.

ఆ మొన్న ఆయనకిచ్చిన సన్మానపత్రాలను, సన్మానసభల వార్తలను,
సేకరించి, తన త్రివర్ణముఖచిత్రంతో అచ్చొత్తించారు.
ఆ పుస్తిక, ఆయన విజిటింగ్ కార్డ్.
ఇంట్రొడక్టరీ డాక్యుమెంట్.
ఆ త్రివర్ణముఖచిత్రంలో ఆయన ఇమేజ్,
ఆయనవలెనే అసాధారణం.
అలవాట్లు ప్రాచ్యాలైనా,
ఆ చిత్రంలోని వేషం, అప్రాచ్యాతి అప్రాచ్యం.
ఇటీవల ఆయన భావాలను దుయ్యబట్టుతూ,
వీ ‘నీవు ముదిరోవెలదివి, నీవిక నయగారాలు చాలించు’ అని,
చి ఒక మహాపత్రికలో, అన్యాపదేశంగా వ్రాశాడట ఎవడో!
క. కొంగ్రొత్త కవిపల్లవుడు.
లు. కవిగారు శపించారట; ఫలితం సంగతి తెలియదు.

★ ఆయన కొక్కటే ఆశ.
 తనవంటికవి, ‘నభూతో న భవిష్యతి’ అని, మారుమ్రోగిపోవాలని.

బిరుదుప్రదానం చేసి, ఇచ్చిన సన్మానపత్రాన్ని అద్దంలోంచి తీసి,
అంకితం పేజీని పెట్టింది.
సన్మానపత్రాలను, పూజాద్రవ్యాలుగా భావించే కవిగారు
కాలుగాలిన పిల్లి అవతారం దాల్చారు;
విలయతాండవం చేశారు.
ఆ సన్మానపత్రాలు, తన అహంతాప్రతిభలకెత్తిన వైజయంతికలు మరి.
ఫలితం, రాత్రి భోజనంలేదు.
మరోసారి -
ఏదో జవుళిదుకాణాన్ని ప్రారంభించడానికి,
ఎవరో అమాత్యవృషభులేతెంచినపుడు,
తాను చదివిన పంచరత్నశంఖారావానికి,
శ్రీవారు శిరః కంపనజేసి,
చిర్నగవులను తొలికానుకగా ఇచ్చుకున్నారట.
మరికొంతకాలానికి, కవిగారి ఒక కృతి పాఠ్యపుస్తకమైంది.
ఇది మంత్రిగారి మలికానుకని జనశ్రుతి.

ఆ మొన్న ఆయనకిచ్చిన సన్మానపత్రాలను, సన్మానసభల వార్తలను,
సేకరించి, తన త్రివర్ణముఖచిత్రంతో అచ్చొత్తించారు.
ఆ పుస్తిక, ఆయన విజిటింగ్ కార్డ్.
ఇంట్రోడక్టరీ డాక్యుమెంట్.
ఆ త్రివర్ణముఖచిత్రంలో ఆయన ఇమేజ్,
ఆయనవలెనే అసాధారణం.
అలవాట్లు ప్రాచ్యాలైనా,
ఆ చిత్రంలోని వేషం, అప్రాచ్యాతి అప్రాచ్యం.
ఇటీవల ఆయన భావాలను దుయ్యబట్టుతూ,
వీ 'నీవు ముదిరోవెలదివి, నీవిక నయగారాలు చాలించు' అని,
చి ఒక మహాపత్రికలో, అన్యాపదేశంగా వ్రాశాడట ఎవడో!
క కొంగ్రొత్త కవిపల్లవుడు.
లు కవిగారు శపించారట; ఫలితం సంగతి తెలియదు.

★ ఆయన కొక్కటే ఆశ.
తనవంటికవి, 'నభూతో న భవిష్యతి' అని, మారుమ్రోగిపోవాలని.

ఇప్పటి పిల్లలకు చదువులు రావట.
తాను చెప్పినా రావట.
అసలది కాలప్రభావమట.
అందరూ చదవకూడదట.
ఆ సరస్వతి అందరికీ వశంకాదట.
కనీసం కొందరైనా, సమాజంలో 'ఛండాలులం' అనుకోవాలట.
అప్పుడే తారతమ్యాలుండి, నాగరికత పెంపొందుతుందిట.
పాశ్చాత్యదేశాల్లోని, జాతివిచక్షణా విధానం,
సౌందర్యానికి సంబంధించినదట.
దాన్ని రాజకీయంగా మార్చడంవల్ల,
కవిత్వానికే ముప్పువాటిల్లిందట.
పల్లకి మోసేవాళ్ళూ, ఛత్రచామరాలు పట్టేవాళ్ళూ,
తమ్మిపడగ పట్టేవాళ్ళూ, మావంతులు, దాసదాసీజనం,
పొగిడేవాళ్ళూ, హారతులిచ్చేవాళ్ళూ,
ఉంటేనే రాజులు; ఆ రాజులుంటేనే తాను,
వాళ్ళులేరు,
తాను ఉన్నాడు.
తానే మిగిలాడట.
మరి మనం- మన లెక్కేమిటి ఆయనకు ?
ఆయన రాసిందల్లా చదివి,
ఓహో ! ఆహా ! అనే వాళ్ళం.
అంతే !!! —



## దీపిక

కొవ్వొత్తి కన్నీరు కారుస్తూ
కరిగిపోయింది
వెలుగుకోసమే వెలిగింది
తనకంటే ఎన్నోరెట్లు వెలుగగల్గిన
వేడివెలుగుకు వినమ్రంగా
నమస్కరించి పోయింది

ఇప్పటి పిల్లలకు చదువులు రావట.
తాను చెప్పినా రావట.
అసలది కాలప్రభావమట.
అందరూ చదవకూడదట.
ఆ సరస్వతి అందరికీ వశంకాదట.
కనీసం కొందరైనా, సమాజంలో 'ఛండాలులం' అనుకోవాలట.
అప్పుడే తారతమ్యాలుండి, నాగరికత పెంపొందుతుందిట.
పాశ్చాత్యదేశాల్లోని, జాతివిచక్షణా విధానం,
సౌందర్యానికి సంబంధించినదట.
దాన్ని రాజకీయంగా మార్చడంవల్ల,
కవిత్వానికే ముప్పువాటిల్లిందట.
పల్లకి మోసేవాళ్ళూ. ఛత్రచామరాలు పట్టేవాళ్ళూ,
తమ్మెపడగ పట్టేవాళ్ళూ, మావంతులు, దాసదాసీజనం,
పొగిడేవాళ్ళూ, హారతులిచ్చేవాళ్ళూ,
ఉంటేనే రాజులు; ఆ రాజులుంటేనే తాను,
వాళ్ళులేరు,
తాను ఉన్నాడు.
తానే మిగిలాడట.
మరి మనం- మన లెక్కేమిటి ఆయనకు ?
ఆయన రాసిందల్లా చదివి,
ఓహో ! ఆహా ! అనే వాళ్ళం.
అంతే !!! —



## దీపిక

కొవ్వొత్తి కన్నీరు కారుస్తూ
కరిగిపోయింది
వెలుగుకోసమే వెలిగింది
తనకంటే ఎన్నోరెట్లు వెలుగగల్గిన
వేడివెలుగుకు వినమ్రంగా
నమస్కరించి పోయింది

చేతనైనంతవరకు చీకటి నెదిరించింది
కన్నీటికి విలువ వుందని చాటింది
వెచ్చదనం వుంటేనే
వెలుగవచ్చుననే సత్యాన్ని చాటింది.
తనకాంతిని పంచియిచ్చింది
తనకాంతిని పంచుకోనిచ్చింది
తనవలెనే పరులు వెలిగితే సంతసించింది.
తాను సూర్యునికి ప్రతినిధినని
నిక్కి చెప్పుకోలేదు కాని
ఒణుకుతూ ఒణుకుతూ
పదే-పదే అదేమాటలు చెప్పింది
తరతమభేదాల పోనాడి
అడిగినవారికి వెలుగునిచ్చింది
స్నేహము లేనిదే తాను వెలుగనన్నది
తనబ్రతుకుకు మారుపేరు వెలుగన్నది
జ్ఞానానికి జీవితానికి
పరమాత్మకు ప్రతీకయై నిల్చినది
తన వెలుతురులో కన్నుతెరచి
బ్రతుకమన్నది -
తననుమాత్రము ముద్దిడుకోవద్దన్నది
తనను పూజించమని వేడుకొనలేదు
వెలుగును పూజించిన లాభమేమి ?
ప్రేమించిన లాభమేమి ?
వెలుగువలె బ్రతుకవలెనంతే.
ప్రేమించి ముద్దిడుకొన్న
పతంగాల తతంగం అంతరిస్తుంది.
పతంగాల పక్షాల గాలితాకిడికి
తాను సురిగిపోదు
వెలుగుతో ఎలామెలగాలో
తెలుసుకోలేని పతంగాలను
మందలించ బోలేదు దీపిక

చేతనై నంతవరకు చీకటి నెదిరించింది
కన్నీటికి విలువ వుందని చాటింది
వెచ్చదనం వుంటేనే
వెలుగవచ్చుననే సత్యాన్ని చాటింది.
తనకాంతిని పంచియిచ్చింది
తనకాంతిని పంచుకోనిచ్చింది
తనవలెనే పరులు వెలిగితే సంతసించింది.
తాను సూర్యునికి ప్రతినిధినని
నిక్కి చెప్పుకోలేదు కాని
ఒణుకుతూ ఒణుకుతూ
పదే-పదే అదేమాటలు చెప్పింది
తరతమభేదాల పోనాడి
అడిగినవారికి వెలుగునిచ్చింది
స్నేహము లేనిదే తాను వెలుగనన్నది
తనబ్రతుకుకు మారుపేరు వెలుగన్నది
జ్ఞానానికి జీవితానికి
పరమాత్మకు ప్రతీకయై నిల్చినది
తన వెలుతురులో కన్ను తెరచి
బ్రతుకమన్నది -
తననుమాత్రము ముద్దిడుకోవద్దన్నది
తనను పూజించమని వేడుకొనలేదు
వెలుగును పూజించిన లాభమేమి ?
ప్రేమించిన లాభమేమి ?
వెలుగువలె బ్రతుకవలెనంతే.
ప్రేమించి ముద్దిడుకొన్న
పతంగాల తతంగం అంతరిస్తుంది.
పతంగాల పక్షాల గాలితాకిడికి
తాను సురిగిపోదు
వెలుగుతో ఎలామెలగాలో
తెలుసుకోలేని పతంగాలను
మందలించ బోలేదు దీపిక

వెలుగును కోరువారిలక్షణము
అదికాదు కనుక.
ఓపికతో దీపికను చూడు
ఇదే మాట - ఇదే మాట
అది వెలిగి - వెలిగి చెప్పుతుంది
దీపిక ప్రాణం - ప్రణవం
సత్యం - శివం - సుందరం.



# నేను మనగల్గితిని

తారుణ్యం నిదాఘమై
నిప్పులు చెరుగుతున్నప్పుడు
నీ ముంగురులు నీడ నిచ్చెనాకు.

బుసలుకొడుతున్న కలల కోడెత్రాచులు
నీకై శికీ మయూరాన్ని చూచి
తటిల్లతలవోలె మెరసి
వల్మీకమ్ముల జొచ్చినవి.

నాలో ఎప్పటినుండియో
సుప్తమైయున్న నవ్వులు
నీ కబరీభరమ్మున పువ్వులై పూచినవి
అవి కుటిలాలకమ్ములా
యమునాసరిత్తరంగమ్ములా
ఆషాఢజలదమ్ములా
నీ వదనసరోజముపై
వ్రాలిన భృంగమ్ములా
నీ కేశపాశమ్మునకు
నే కట్టుబడిపోతిని
నీ నీడలో నే మనగల్గితిని.

వెలుగును కోరువారిలక్షణము
అదికాదు కనుక.
ఓపికతో దీపికను చూడు
ఇదే మాట - ఇదే మాట
అది వెలిగి - వెలిగి చెప్పుతుంది
దీపిక ప్రాణం - ప్రణవం
సత్యం - శివం - సుందరం.



# నేను మనగల్గితిని

తారుణ్యం నిదాఘమై
నిప్పులు చెరుగుతున్నప్పుడు
నీ ముంగురులు నీడ నిచ్చెనాకు.

బుసలుకొడుతున్న కలల కోడె[త్రా]చులు
నీకై శికీ మయూరాన్ని చూచి
తటిల్లతలవోలె మెరసి
వల్మీకమ్ముల జొచ్చినవి.

నాలో ఎప్పటినుండియో
సుప్తమైయున్న నవ్వులు
నీ కబరీభరమ్మున పువ్వులై పూచినవి
అవి కుటిలాలకమ్ములా
యమునాసరిత్తరంగమ్ములా
ఆషాఢజలదమ్ములా
నీ వదనసరోజముపై
వ్రాలిన భృంగమ్ములా
నీ కేశపాశమ్మునకు
నే కట్టుబడిపోతిని
నీ నీడలో నే మనగల్గితిని.

నీ కురులు వీణలై
పరిమళ రాగభావమ్ములై
కోకిలమ్ములై - నా బ్రతుకు తోటకొక
వింత అందమ్ములు చేకూర్చినవి
నింగివంటి నా మనస్సునందు
మబ్బులై పరుగిడినవి
కనుకనే నేను మనగల్గితిని.



# నీవు చూడలేవు

బహు రూపుల నాయకుడు
అదనుకోసం తొంగి తొంగి చూసి
చీకట్లలుముకున్నదే తడవుగా
బిక్క మొహం చేసుకుని
అమాయకుడిలా వచ్చాడు.
చీకటి బలపడుతున్నకొద్దీ
అతని కలరూపు స్పష్టంగా
మెరుస్తూ కన్పిస్తున్నది
లోకమంతా చీకటి గూడై
తమస్సాగరంలా తారట్లాడుతున్నది
వస్తున్న రేడు కడలి ఘోష వినిపించుకోడు
చెలియలికట్ట తెగదని తెలుసు.
మంచితనానికుండే దుర్లక్షణాలు తెలుసు
నింగినంటుకునే గంతులూ - రంతులూ
తనకోసం కావని -
తననేమీ చేయవని - చేయలేవనీ తెలుసు.
తానంటే లోకానికెంత హడలు
నిక్కివున్న కొండలకొమ్ములు
తెలతెలబోయినవి.

నీ కురులు వీణలై
పరిమళ రాగభావమ్ములై
కోకిలమ్ములై - నా బ్రతుకు తోటకొక
వింత అందమ్ములు చేకూర్చినవి
నింగివంటి నా మనస్సునందు
మబ్బులై పరుగిడినవి
కనుకనే నేను మనగల్గితిని.



## నీవు చూడలేవు

బహు రూపుల నాయకుడు
అదనుకోసం తొంగి తొంగి చూసి
చీకట్లలుముకున్నదే తడవుగా
బిక్కమొహం చేసుకుని
అమాయకుడిలా వచ్చాడు.
చీకటి బలపడుతున్నకొద్దీ
అతని కలరూపు స్పష్టంగా
మెరుస్తూ కన్పిస్తున్నది
లోకమంతా చీకటి గూడై
తమస్సాగరంలా తారట్లాడుతున్నది
వస్తున్న రేడు కడలి ఘోష వినిపించుకోడు
చెలియలికట్ట తెగదని తెలుసు.
మంచితనానికుండే దుర్లక్షణాలు తెలుసు
నింగినంటుకునే గంతులూ - రంతులూ
తనకోసం కావని -
తననేమీ చేయవని - చేయలేవనీ తెలుసు.
తానంటే లోకానికెంత హడలు
నిక్కివున్న కొండలకొమ్ములు
తెలతెలబోయినవి.

సరస్సులు చాందినీలు పరచి
తెల్లబావుటాల నెగురవేసినవి
తనవూసైనా ఎత్తని లోకం, ఇప్పుడందగాడంటున్నది.
చల్లనివాడంటున్నది -
త్యాగమూర్తి అంటున్నది
లచ్చితమ్ముడొచ్చినాడని
ఆణిముత్యమ్ములు తెచ్చినాడని సంబరపడుతున్నవి.
మహాహాలహాలానికి తోబుట్టువా యితడు ?
ఇంతటి చల్లనివాడెలా అవుతాడు !
మనవాడే - మన చల్లనిదేవర
సహస్రదీపికా నీరాజనాలిచ్చుకుందాము
వేడుకలు జరుపుకుందాము
కౌముదీ జాగరములు చేసుకుందాము
ఈ చల్లని తెల్లనిచీకటిలో ఎవరేమిచేసినా కనపడదు
ఎంతచేసినా అలసటుండదు
చేతనైనవాళ్ళ యిళ్ళు చక్కబెట్టుకోవచ్చు
ఆతని చల్లని నీడలో కూచుని ఆతడిచ్చిన అమృతము సేవిద్దాం
ఇక మనకు చావుండదు.
వేడివెలుగు రాకముందే చక్కదిద్దుకుందాము
చలువతేని రాజ్యంలో
కలువలేమల శుద్ధాంతంలో
అందరూ సమతాజ్యోత్స్నాస్నాతులే
అందరిదీ ఒకే వర్ణం
విషంకక్కే చెట్లన్నీ కల్పతరువుల్లా మురిసిపోతున్నాయి
మండుటెండలో చలిపందిళ్ళలో కులుకుతున్నవారంతా
ప్రచండ తపనపీడితులకు
చల్లదనాన్ని అందిస్తామని వస్తున్నారు.
ఇప్పుడు వీరిచ్చేదీ యివ్వగలిగేదీ
ఏముందని తెల్లబోతున్నారు జనం
ఈ జ్యోత్స్నా రంగస్థలీ ప్రజలంతా
తెలి దువ్వలువల్లో దేవతలేమో ననిపిస్తున్నారు.

సరస్సులు చాందినీలు పరచి
తెల్లబావుటాల నెగురవేసినవి
తనవూ పైనా ఎత్తని లోకం, ఇప్పుడందగాడంటున్నది.
చల్లనివాడంటున్నది -
త్యాగమూర్తి అంటున్నది
లచ్చితమ్ముడొచ్చినాడని
ఆణిముత్యమ్ములు తెచ్చినాడని సంబరపడుతున్నవి.
మహాహాలహాలానికి తోబుట్టువా యితడు ?
ఇంతటి చల్లనివాడెలా అవుతాడు !
మనవాడే - మన చల్లనిదేవర
సహస్రదీపికా నీరాజనాలిచ్చుకుందాము
వేడుకలు జరుపుకుందాము
కౌముదీ జాగరములు చేసుకుందాము
ఈ చల్లని తెల్లనిచీకటిలో ఎవరేమిచేసినా కనపడదు
ఎంతచేసినా అలసటుండదు
చేతనైనవాళ్ళు యిళ్ళు చక్కబెట్టుకోవచ్చు
ఆతని చల్లని నీడలో కూచుని ఆతడిచ్చిన అమృతము సేవిద్దాం
ఇక మనకు చావుండదు.
వేడివెలుగు రాకముందే చక్కదిద్దుకుందాము
చలువతేని రాజ్యంలో
కలువలేమల శుద్ధాంతంలో
అందరూ సమతాజ్యోత్స్నాస్నాతులే
అందరిదీ ఒకే వర్ణం
విషంకక్కే చెట్లన్నీ కల్పతరువుల్లా మురిసిపోతున్నాయి
మండుటెండలో చలిపందిళ్ళలో కులుకుతున్నవారంతా
ప్రచండ తపనపీడితులకు వీ
చల్లదనాన్ని అందిస్తామని వస్తున్నారు. చి
ఇప్పుడు వీరిచ్చేదీ యివ్వగలిగేదీ క
ఏముందని తెల్లబోతున్నారు జనం లు
ఈ జ్యోత్స్నా రంగస్థలీ ప్రజలంతా ★
తెలి దువ్వలువల్లో దేవతలేమో ననిపిస్తున్నారు.

నే నంటే నేనే మిన్నేటినని ప్రతి పిల్లకాలువగోల
చీకటితో చేతులు కలిపి
కమ్మగా చల్లగా బ్రతికే రాజు పాలనలో
అందరి కావేషాలకు విలువ వుండితీరుతుంది.
ఈ వెన్నెల చీకటికప్పుకొన్న దుప్పటి
తనవని చెప్పుకుంటున్న పదహారుకళల్లో
ఏ ఒక్కటీ తనదికాదు
అన్నీ అరువు తెచ్చుకొన్నవే ·
ఆ రాజు అందం అంతే
పైన పటారం – లోన లొటారం
దూరపుకొండలు నునుపుగా!
ఆ కళంకం కుందేటిపిల్లకాదు
జింకపిల్ల అసలేకాదు
అతడెత్తిన చీకటి టెక్కెము
గుడ్డిభక్తుడు తప్ప
తెల్లవారిందని ఎవడూ నమ్మడంలేదు.
తెల్లవారితే వేడేదీ ?
లక్ష నక్షత్రాలు చుట్టూ భజనచేస్తున్నా
ఒక్క వేగుచుక్కకు సరిరావు
వేగుచుక్క పొడుస్తుంది
తామసాధికారం అంతరిస్తుంది
చీకటిరేడా – చల్లనివాడా !
చల్లదనం చావుకు మరోపేరు
పో ! కనపడడం లేదా
వేగుచుక్క నిగనిగలు
లోకబాంధవుడొస్తున్నాడు
నిన్ను త్రోసి రాజంటాడు
ఇక నీ ఆటకట్టు –
ఆ వెలుగును నీవు చూడలేవు
మెల్లగా చల్లగా జారిపో – పో !



నేనంటే నేనే మిన్నేటినని ప్రతి పిల్లకాలువగోల
చీకటితో చేతులు కలిపి
కమ్మగా చల్లగా బ్రతికే రాజు పాలనలో
అందరి కావేషాలకు విలువ వుండితీరుతుంది.
ఈ వెన్నెల చీకటికప్పుకొన్న దుప్పటి
తనవని చెప్పుకుంటున్న పదహారుకళల్లో
ఏ ఒక్కటీ తనదికాదు
అన్నీ అరువు తెచ్చుకొన్నవే
ఆ రాజు అందం అంతే
పైన పటారం — లోన లొటారం
దూరపుకొండలు నునుపుగా!
ఆ కళంకం కుందేటిపిల్లకాదు
జింకపిల్ల అసలేకాదు
ఆతడెత్తిన చీకటి బెక్కెము
గుడ్డిభక్తుడు తప్ప
తెల్లవారిందని ఎవడూ నమ్మడంలేదు.
తెల్లవారితే వేదేదీ ?
లక్ష నక్షత్రాలు చుట్టూ భజనచేస్తున్నా
ఒక్క వేగుచుక్కకు సరిరావు
వేగుచుక్క పొడుస్తుంది
తామసాధికారం అంతరిస్తుంది
చీకటిరేడా - చల్లనివాడా !
చల్లదనం చావుకు మరోపేరు
పో ! కనపడడం లేదా
వేగుచుక్క నిగనిగలు
లోకబాంధవుడొస్తున్నాడు
నిన్ను త్రోసి రాజంటాడు
ఇక నీ ఆటకట్టు -
ఆ వెలుగును నీవు చూడలేవు
మెల్లగా చల్లగా జారిపో - పో !



# గతాన్ని నమ్మకు.

ఎంత చక్కనిదైనా గతమంతా స్వగతం
గతాన్ని నెమరవేయకు.
గతంలోవలె నడువడానికికాదు
గతాన్ని చూడటంకోసం,
గతంలో ఏకొద్దైనామంచి ఉంటే తెలుసుకోవడానికి,
సజీవమైన జాతి, చరిత్రను పునరావృత్తం కానీయదు.
మనోవికాసానికి మారుపేరే చరిత్ర
అనుక్షణం పరివర్తన శీలమైందీ జగన్మేఘం
పాతనీటిని మ్రింగినా అబ్దమాలికలు కొత్త జీవనాన్నిస్తాయి.
రుచిలో, రంగులో, అంతర్నిహిత శక్తిలో పాతనీటితో పోలికే ఉండదు.
మన అనుభవాలు అంతే.
తన చుట్టూనిర్మించుకున్న సాలీడు గూడులాంటిది చారిత్రికౌన్నత్యం.
తాను పట్టిన పిట్టగొడుగది.
మన తాతల ముత్తాతల తాతలు, అలక్ష్యేంద్రాదులను
తరిమి తోలినారన్నసంగతి ఇటీవలే తెలుకోగలిగి బాధపడుతున్నావా ?
ఎన్నెన్నో అబద్ధాలు మనచేత మ్రింగించారని
వాంతి చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నావా ?
అతీతంలోని మన పెద్దలు నిజంగా గొప్పవారే !
కథావశిష్టులకోసం కన్నీరు కారుస్తావా ?
అప్పుడెప్పుడో జరిగిన అన్యాయానికి
ఇప్పుడు పండ్లు కొరుకుకుంటున్నావా ?
నీ పండ్లే అరిగినవి
నీ కండ్లే మండినవి.
నీ మనసే విరిగింది. వీ
ఏమి సాధిస్తావు ? ఏమేమి తేలుస్తావు ? చి
ఇండియా మాదని గ్రీకులను క
గాంధారం మాదని భారతీయులను లు
గంగాహిమాలయాలు మావేనని చైనావాడిని ★
కబంధహస్తాలు - చాచమంటుంది చరిత్ర పిచ్చి.

# గతాన్ని నమ్మకు.

ఎంత చక్కనిదైనా గతమంతా స్వగతం
గతాన్ని నెమరవేయకు.
గతంలోవలె నడువడానికికాదు
గతాన్ని చూడటంకోసం,
గతంలో ఏకొద్దైనామంచి ఉంటే తెలుసుకోవడానికి,
సజీవమైన జాతి, చరిత్రను పునరావృత్తం కానీయదు.
మనోవికాసానికి మారుపేరే చరిత్ర
అనుక్షణం పరివర్తన శీలమైంది జగన్మేఘం
పాతనీటిని మ్రింగినా అబ్దమాలికలు కొత్త జీవనాన్నిస్తాయి.
రుచిలో, రంగులో, అంతర్నిహిత శక్తిలో పాతనీటితో పోలికే ఉండదు.
మన అనుభవాలు అంతే.
తన చుట్టూనిర్మించుకున్న సాలీడు గూడులాంటిది చారిత్రికౌన్నత్యం.
తాను పట్టిన పిట్టగొడుగది.
మన తాతల ముత్తాతల తాతలు, అలక్ష్యేంద్రాదులను
తరిమి తోలినారన్నసంగతి ఇటీవలే తెలుకోగలిగి బాధపడుతున్నావా ?
ఎన్నెన్నో అబద్ధాలు మనచేత మ్రింగించారని
వాంతి చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నావా ?
అతీతంలోని మన పెద్దలు నిజంగా గొప్పవారే !
కథావశిష్టులకోసం కన్నీరు కారుస్తావా ?
అప్పుడెప్పుడో జరిగిన అన్యాయానికి
ఇప్పుడు పండ్లు కొరుక్కుంటున్నావా ?
నీ పండ్లే అరిగినవి
నీ కండ్లే మండినవి.
నీ మనసే విరిగింది. వీ
ఏమి సాధిస్తావు ? ఏమేమి తేలుస్తావు ? చి
ఇండియా మాదని గ్రీకులను క
గాంధారం మాదని భారతీయులను లు
గంగాహిమాలయాలు మావేనని చైనావాడిని ★
కబంధహస్తాలు - చాచమంటుంది చరిత్ర పిచ్చి.

అధునాతన మానవతామూర్తి శ్రీరామచంద్రుడు
ఆ హస్తాలను నరికివేస్తాడు.
బూజుపట్టిన దస్తావేజుల్ని తిరగవేయకు
ఇప్పుడొక అశోకుడు,
ఒక అక్బరు, ఒకరాయలుద్భవిస్తే బాగుండునని
కలల్లో కలకలలాడేమోహంతో ఎదురుచూడకు.
కాశ్మీరు మొదలుకుని కన్యాకుమారివరకు నీదే.
ఈ భూమంతా నీదే ఏలుకో
చతురదధివేలావలయితభూమండలీనాయకుడి లాంటి
నేతిబీరకాయ బిరుదుకాదిది.
క్షామరాక్షసి గోళ్ళవలె భయంకరంగా
ఉన్న ముళ్ళపొదలను పెకల్చు.
కడలి కుక్షిలోనికి పోతున్న
అమృతాన్నితెచ్చి నీ మాతృమూర్తి కందివ్వు
ఆర్థిక దాస్యాన్నించి విడిపించుకో.
నీకున్నంత చరిత్రకూడా లేని జాతులు
నిన్నాడించ గలుగుతాయన్న నిజాన్ని తెలుసుకుంటున్నావా ?
మంత్రాలకు చింతకాయలు రాలవు.
చేవ ఉంటేనే చావు నెదిరిస్తావు.
మాజీతో రాజీపడకు,
మళ్ళీ వెనక్కిపోతావా ?
ఎంత వెనక్కిపోతావు ?
మరీ వెనక్కిపోకు.
గుహల్లోకి పోతావు.
కోతివౌతావు సుమా ?
చరిత్ర కిరీట భారంతోఈ కాలంలో తల ఎత్తలేవు.
నిన్నటివానికి తెలిసినమార్గం, వాడు వేసుకున్నాడు.
వాని గమ్యంవేరు.
నీ లక్ష్యం వేరు.
నేస్తం! గతాన్ని నమ్మకు.

అధునాతన మానవతామూర్తి శ్రీరామచంద్రుడు
ఆ హస్తాలను నరికివేస్తాడు.
బూజుపట్టిన దస్తావేజుల్ని తిరగవేయకు
ఇప్పుడొక అశోకుడు,
ఒక అక్బరు, ఒకరాయలుద్భవిస్తే బాగుండునని
కలల్లో కలకలలాడేమొహంతో ఎదురుచూడకు.
కాశ్మీరు మొదలుకుని కన్యాకుమారివరకు నీదే.
ఈ భూమంతా నీదే ఏలుకో
చతురదధివేలావలయితభూమండలీనాయకుడి లాంటి
నేతిబీరకాయ బిరుదుకాదిది.
క్షామరాక్షసి గోళ్లవలె భయంకరంగా
ఉన్న ముళ్లపొదలను పెకల్చు.
కడలి కుక్షిలోనికి పోతున్న
అమృతాన్నితెచ్చి నీ మాతృమూర్తి కందివ్వు
ఆర్థిక దాస్యాన్నించి విడిపించుకో.
నీకున్నంత చరిత్రకూడా లేని జాతులు
నిన్నాడించ గలుగుతాయన్న నిజాన్ని తెలుసుకుంటున్నావా ?
మంత్రాలకు చింతకాయలు రాలవు.
చేవ ఉంటేనే చావు నెదిరిస్తావు.
మాజీతో రాజీపడకు,
మళ్లీ వెనక్కిపోతావా ?
ఎంత వెనక్కిపోతావు ?
మరీ వెనక్కిపోకు.
గుహల్లోకి పోతావు.
కోతివౌతావు సుమా ?
చరిత్ర కిరీట భారంతో ఈ కాలంలో తల ఎత్తలేవు.
నిన్నటివానికి తెలిసినమార్గం, వాడు వేసుకున్నాడు.
వాని గమ్యంవేరు.
నీ లక్ష్యం వేరు.
నేస్తం ! గతాన్ని నమ్మకు.

# "బ్రాహ్మీమయమూర్తి"

స్వప్నాధ్వంలో సంచరిస్తున్నాను
దేవుడొకడు తారసిల్లి వరంకోరుకో మన్నాడు
వాల్మీకిని చూపుమన్నాను
కవిత్రయాన్ని చూపుమన్నాను
"ఆ నలుగురిని ఒకేసారి నీ కన్నులు చూడలేవు"
"దివ్యనేత్రాలను ప్రసాదించుస్వామీ !"
"అక్కరలేదు నీ కన్నులతోనే చూడు, అటుచూడు,
వారి ప్రతిభా జ్యోతిస్సులను జీర్ణించుకొని,
వారి తరువాత లోకంగడించుకొన్న అనుభవాన్ని
పుడిసిట బట్టిన మూర్తినిచూడు" అన్నాడు.
ఒక మహాజ్యోతిశ్శిఖరం
ఒకొక్కక్క కిరణం నావైపుకు దూకుతున్నది, కాంతివాఃపూర్ణప్రపాతంలా
వెనక్కి ఒరిగితిని, ఆకిరణం-
మాటున వున్న ఒక్క మణిని చుంబించింది.
ఆ మణిని చేతిలోనికి తీసికొన్నాను
ఎన్నోకోణాలున్నాయి దానికి
ఒకొక్కక్క కోణం ఒక పుస్తకం అయింది
నేను చదివిన పుస్తకాలే అవి
నాకు జ్ఞానభిక్షను పెట్టిన పుస్తకాలే అవి
ఇంటిలో, గ్రంథాలయంలో, రైలులో
కృష్ణజననావాసంలో చదివినవే అవి. వీ
అతడు "కనపడుటలేదా బ్రాహ్మీమయమూర్తి, చి
నీ వడిగిన కవితామూర్తి" అన్నాడు క
తిరిగి జ్యోతిశ్శిఖరం వైపుకు చూశాను ఋ
విశ్వనాథవారు నిలుచున్నారు. ★
అపరాదిశేషునివలె భాసిస్తున్నారు

# "బ్రాహ్మీమయ మూర్తి"

స్వప్నాధ్వంలో సంచరిస్తున్నాను
దేవుడొకడు తారసిల్లి వరంకోరుకో మన్నాడు
వాల్మీకిని చూపుమన్నాను
కవిత్రయాన్ని చూపుమన్నాను
"ఆ నలుగురిని ఒకేసారి నీ కన్నులు చూడలేవు"
"దివ్యనేత్రాలను ప్రసాదించుస్వామీ !"
"అక్కరలేదు నీ కన్నులతోనే చూడు, అటుచూడు,
వారి ప్రతిభా జ్యోతిస్సులను జీర్ణించుకొని,
వారి తరువాత లోకంగడించుకొన్న అనుభవాన్ని
పుడిసిట బట్టిన మూర్తినిచూడు" అన్నాడు.
ఒక మహాజ్యోతిశ్శిఖరం
ఒక్కొక్క కిరణం నావైపుకు దూకుతున్నది, కాంతివాఃపూర్ణప్రపాతంలా
వెనక్కి ఒరిగితిని, ఆకిరణం-
మాటున వున్న ఒక్క మణిని చుంబించింది.
ఆ మణిని చేతిలోనికి తీసికొన్నాను
ఎన్నోకోణాలున్నాయి దానికి
ఒక్కొక్క కోణం ఒక పుస్తకం అయింది
నేను చదివిన పుస్తకాలే అవి
నాకు జ్ఞానభిక్షను పెట్టిన పుస్తకాలే అవి
ఇంటిలో, గ్రంధాలయంలో, రైలులో
కృష్ణజననావాసంలో చదివినవే అవి. వీ
అతడు "కనపడుటలేదా బ్రాహ్మీమయమూర్తి, చి
నీ వడిగిన కవితామూర్తి" అన్నాడు క
తిరిగి జ్యోతిశ్శిఖరం వైపుకు చూశాను లు
విశ్వనాథవారు నిలుచున్నారు. ★
అపరాదిశేషునివలె భాసిస్తున్నారు

వెయ్యేళ్ల తెలుగు సాహిత్యం రూపుగొన్నట్లుంది.
అతిగభీర ప్రగాఢ సువిశాల ప్రతిభా మహాసాగరం
మానవాకృతి దాల్చినట్లున్నది.
దైనందినజీవనసమస్యాజీమూతాల సమవాకారాన్ని మాత్రమే
చిత్రించే కలం కాదాయనది.
జీవునిలోని దేవుణ్ణి బాహిరిల్లజేసే దివ్యలేఖిని ఆయనది.
ఎప్పటికప్పుడే నిత్యసత్యానికి
నిర్వచనాలు మార్చుకొనే స్వభావం కాదాయనది.
లక్ష్యసిద్ధిలేని ఉబుసుపోక వ్రాతలు ఆయనెఱుగడు.
ఏ ఊహ ఊపిరిపోయగలదో,
ఏ ఊహ మెదడుకి మేత పెట్టగలదో,
ఏ ఊహ మనోలోకాలను ఆక్రమించుకో గలదో,
ఆ ఊహకాయన కవితాకృతి నిస్తాడు.
నవలయినా, కథయినా, వ్యాసమైనా, ఉపన్యాసమైనా
సంస్కారమున్న మనస్సును
సూదంటురాయిలా ఆకర్షించుకొంటుంది
ఎప్పటినుంచో పరిష్కారం కానిసమస్య
కలలో పరిష్కారానికి నోచుకొంది
తలచుటలోను, తెలుపుటలోను
వీ అచ్చంగా భారతీయుడతడు
చి ఎప్పుడు చేసుకున్న పుణ్యమోమరి
క మనమాయనకథమర్లులం
లు మనం ఆయనకు సమకాలీనులం
★ తెనుగుతల్లి నోములపంట
 విశ్వనాథ సత్యనారాయణకు కైమోడ్పులు.



వెయ్యేళ్ల తెలుగు సాహిత్యం రూపుగొన్నట్లుంది.
అతిగభీర ప్రగాఢ సువిశాల ప్రతిభా మహాసాగరం
మానవాకృతి దాల్చినట్లున్నది.
దైనందినజీవనసమస్యాజీమూతాల సమవాకారాన్ని మాత్రమే
చిత్రించే కలం కాదాయనది.
జీవునిలోని దేవుణ్ణి బాహిరిల్లజేసే దివ్యలేఖిని ఆయనది.
ఎప్పటికప్పుడే నిత్యసత్యానికి
నిర్వచనాలు మార్చుకొనే స్వభావం కాదాయనది.
లక్ష్యసిద్ధిలేని ఉబుసుపోక వ్రాతలు ఆయనెఱుగడు.
ఏ ఊహ ఊపిరిపోయగలదో,
ఏ ఊహ మెదడుకి మేత పెట్టగలదో,
ఏ ఊహ మనోలోకాలను ఆక్రమించుకో గలదో,
ఆ ఊహకాయన కవితాకృతి నిస్తాడు.
నవలయినా, కథయినా, వ్యాసమైనా, ఉపన్యాసమైనా
సంస్కారమున్న మనస్సును
సూదంటురాయిలా ఆకర్షించుకొంటుంది
ఎప్పటినుంచో పరిష్కారం కానిసమస్య
కలలో పరిష్కారానికి నోచుకొంది
తలచుటలోను, తెలుపుటలోను
వీ అచ్చంగా భారతీయుడతడు
చి ఎప్పుడు చేసుకున్న పుణ్యమోమరి
క మనమాయనకధమర్ణులం
లు మనం ఆయనకు సమకాలీనులం
★ తెనుగుతల్లి నోములపంట
 విశ్వనాథ సత్యనారాయణకు కైమోడ్పులు.



# చక్రవర్తి వేణుగోపాల్

జననం : అక్టోబర్ 27, 1937 అనంతపురంలో. 1957 లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పట్టభద్రులు. ప్రస్తుతం విద్యుచ్ఛక్తి శాఖలో ఉద్యోగం. వీరి కథలు 'ప్రజామత' ల్లోనూ, గేయాలు "ఆంధ్రప్రభ"ల్లోనూ విరివిగా ప్రచురింపబడ్డాయి.

"సాహిత్యాన్ని నడివీధిలో నగ్నంగా నిలబెట్టి "అభ్యుదయ" మని భ్రమింపజేయడం ఆత్మహత్యా సదృశమవుతుంది. ఛందోబద్ధమయిన కవిత మృగ్యమైన యిప్పుడు, మదిలో మెదలిన భావాలని అందరికీ అర్థమయ్యేట్లు పొందికగా నైనా వ్రాయాలి. ఆ ప్రయత్నం లోని ప్రథమ సోపానమే ఈ గేయాల రచన"

— చక్రవర్తి.

# చక్రవర్తి వేణుగోపాల్

జననం : అక్టోబర్ 27, 1937 అనంతపురంలో. 1957 లో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి పట్టభద్రుడు. ప్రస్తుతం విద్యుచ్ఛక్తి శాఖలో ఉద్యోగం. వీరి కథలు 'ప్రజామత' ల్లోనూ, గేయాలు "ఆంధ్రప్రభ"ల్లోనూ విరివిగా ప్రచురింపబడ్డాయి.

"సాహిత్యాన్ని నడివీధిలో నగ్నంగా నిలబెట్టి "అభ్యుదయ" మని భ్రమింపజేయడం ఆత్మహత్యా సదృశమవుతుంది. ఛందోబద్ధమయిన కవిత మృగ్యమైన యిప్పుడు, మదిలో మెదలిన భావాలని అందరికీ అర్థమయ్యేట్లు పొందికగా నైనా వ్రాయాలి. ఆ ప్రయత్నం లోని ప్రథమ సోపానమే ఈ గేయాల రచన"

— చక్రవర్తి.

# శీర్షిక

గడచినక్షణాల విలువల్ని అంచనావేస్తూ కూర్చుంటే
ఇప్పటికాలం వృధా అయిపోతుంది -
అందుకే అన్నారేమో 'కాలానికి ఒన్-వే-ట్రాఫిక్' అని.

పాతడైరీలని తిరగవేస్తే
అనుభవాల్ని జ్ఞాపకం చేసుకోవచ్చు -
అసంపూర్తి కథలకి ముగింపు దొరకవచ్చు.

తెలుగువాడికి కోపమెక్కువని
తెగడుతున్నారందరూ - ఆ
తెలుగువాడికే తెలివి ఎక్కువని
తెలిసినా పలుకరు.

ఏడవటానికే టైము చాలటంలేదు
ఇక నవ్వేందుకి తీరికెక్కడిది ?
జీవితంతో రాజీపడదామని
ఎంత సిన్సియర్‌గా ట్రై చేస్తున్నా
లాభం కనిపించటంలేదు.

పిచ్చిగీతల కాగితమనుకొని
గాలిపటం చేసి ఆడుకొంటున్నాడు పిల్లవాడొకడు -
ఇంటర్నేషనల్ మోడరన్ ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో
ఆ గీతలకి ఫస్ట్ ప్రైజ్ వచ్చిందని - వాడికేం తెలుసు !

కావ్యనాయికల విరహవేదనల్ని
మరొక్కమారు విలోకించితే
ఆగిపోయిన ప్రణయగీతికి అనుపల్లవి వ్రాయవొచ్చు
చెరిగిపోయిన కలలనన్నిటిని
ఏర్చి-కూర్చి-నూతనంగా నిర్మిస్తే
సరికొత్త సినిమాకథ కావొచ్చు.

# శీర్షిక

గడచిననక్షణాల విలువల్ని అంచనావేస్తూ కూర్చుంటే
ఇప్పటికాలం వృధా అయిపోతుంది -
అందుకే అన్నారేమో 'కాలానికి ఒన్-వే-ట్రాఫిక్' అని.

పాతడైరీలని తిరగవేస్తే
అనుభవాల్ని జ్ఞాపకం చేసుకోవచ్చు -
అసంపూర్తి కథలకి ముగింపు దొరకవచ్చు.

తెలుగువాడికి కోపమెక్కువని
తెగడుతున్నారందరూ - ఆ
తెలుగువాడికే తెలివి ఎక్కువని
తెలిసినా పలుకరు.

ఏడవటానికే టైము చాలటంలేదు
ఇక నవ్వేందుకి తీరికెక్కడిది ?
జీవితంతో రాజీపడదామని
ఎంత సిన్సియర్‌గా ట్రై చేస్తున్నా
లాభం కనిపించటంలేదు.

పిచ్చిగీతల కాగితమనుకొని
గాలిపటం చేసి ఆడుకొంటున్నాడు పిల్లవాడొకడు -
ఇంటర్నేషనల్ మోడరన్ ఆర్ట్ ఎగ్జిబిషన్‌లో
ఆ గీతలకి ఫస్ట్ ప్రైజ్ వచ్చిందని - వాడికేం తెలుసు!

కావ్యనాయికల విరహవేదనల్ని
మరొక్కమారు విలోకించితే
ఆగిపోయిన ప్రణయగీతికి అనుపల్లవి వ్రాయవొచ్చు
చెరిగిపోయిన కలలనన్నిటిని
ఏర్చి-కూర్చి-నూతనంగా నిర్మిస్తే
సరికొత్త సినిమాకథ కావొచ్చు.

నాపై నీవేం జాలిచూపఖ్ఖర్లేదు -
నా వ్రాతలకి నీ ఆముఖమఖ్ఖర్లేదు -
నన్నిట్లాగే బ్రతకనీ -
నన్నిట్లాగే వ్రాయనీ -
చేతనైతే అభ్యుదయానికి అర్ధం వెతుకు -
నాగరికతని నిర్వచించు.

ఇది వచనమో — గేయమో - పద్యమో -
నాకేం తెలియదు;
ఎదలో కదలిన భావాలని యధాతథంగా వ్రాస్తున్నా -
కేవలం ఇలా వ్రాయటానికే
ఎన్ని సిగరెట్లు ఖర్చయ్యాయో -
పీకల్ని లెక్కించితేగానీ తెలియదు
కానీ అలా లెక్కవేస్తూ కూర్చుంటే
ఈ క్షణం వృధా కావచ్చు.

ఇంకా దీనికి శీర్షిక నిర్ణయించలేదు.
అప్పుడే కొన్ని క్షణాలు వెనక్కి వెళ్ళిపొయ్యాయ్ -
బాబ్బాబు ! ఆ శీర్షికేదో
నీవే వ్రాసుకుని చదువుకో యీ వ్రాతల్ని.

## మనస్తత్వాలు

ఒకడు —

నాలో అద్వితీయాదర్శాలున్నాయ్
వీ నవరసాల్నాలో మిళితమైవున్నాయ్
చి నూతన భావాల్నాలో నిరంతరం నాట్యం చేస్తాయ్ - కాని
క లేని దొక్కటే కార్యశూరత.
లు భావకవితా తరంగాల్నాలో బుద్బుద ధ్వనులు చేస్తాయ్ !
★ వాటిని భాషలోపెట్టితే భ్రష్టుపట్టిపోతాయ్.
24 అంతరంగంలో ప్రపంచాన్ని పైకి తీసుకొచ్చే తాహతుంది

నాపై నీవేం జాలిచూపక్కర్లేదు -
నా వ్రాతలకి నీ ఆముఖమక్కర్లేదు -
నన్నిట్లాగే బ్రతకనీ -
నన్నిట్లాగే వ్రాయనీ -
చేతనైతే అభ్యుదయానికి అర్థం వెతుకు -
నాగరికతని నిర్వచించు.

ఇది వచనమో — గేయమో - పద్యమో -
నాకేం తెలియదు;
ఎదలో కదలిన భావాలని యథాతథంగా వ్రాస్తున్నా -
కేవలం ఇలా వ్రాయటానికే
ఎన్ని సిగరెట్లు ఖర్చయ్యాయో -
పీకల్ని లెక్కించితేగానీ తెలియదు
కానీ అలా లెక్కవేస్తూ కూర్చుంటే
ఈ క్షణం వృథా కావచ్చు.

ఇంకా దీనికి శీర్షిక నిర్ణయించలేదు.
అప్పుడే కొన్ని క్షణాలు వెనక్కి వెళ్ళిపోయ్యాయ్ -
బాబ్బాబు ! ఆ శీర్షికేదో
నీవే వ్రాసుకుని చదువుకో యీ వ్రాతల్ని.

## మనస్తత్వాలు

ఒకడు —

నాలో అద్వితీయాదర్శాలున్నాయ్
నవరసాల్నాలో మిళితమైవున్నాయ్
నూతన భావాల్నాలో నిరంతరం నాట్యం చేస్తాయ్ - కాని
లేని దొక్కటే కార్యశూరత.
భావకవితా తరంగాల్నాలో బుద్బుద ధ్వనులు చేస్తాయ్ !
వాటిని భాషలో పెట్టితే భ్రష్టుపట్టిపోతాయ్.
అంతరంగంలో ప్రపంచాన్ని పైకి తీసుకొచ్చే తాహతుంది

అయితే యేదో అశక్తత నన్నావరించింది –
అని ఒకడావేదన పడతాడు.

ఇంకొకడు –

హుఁ.... ఈ ప్రపంచంలో నరత్వం నశించింది
క్రూరత్వం వ్యాపించింది
ఉండలేనీ ప్రపంచంలో
నిలువలేనీ భూభాగంలో – అందుకే....
పోతాను – పోతాను ఎడారి దారిన పోతాను.
ముక్కుసూటిగా పోతాను – దిక్చక్రపు దరికే పోతాను.
కామక్రోధాలకు దూరంగా –
అనంత విశ్వంనుంచి అంతర్ధానమై పోతాను
ఆశనిరాశల పాశంనుంచీ –
జీవితబాధల బారినుంచీ –
పడమటికే పయనం కడతా –
మృత్యువుకే అంజలినిస్తా –
అని యింకొకడు మృత్యువు నారాధిస్తాడు

మరొకడు –

జీవన్నాటకంలో చివరి అంకం సమాప్తమౌతోంది.
అయింది గత స్మృతులని
నూతనం చేయడానికి ప్రయత్నం విఫలం
ఇహంలో సుఖంలేదు – వొట్టిచావు నాకఖ్ఖర్లేదు.
పోవాలి స్వర్గానికి బొందితో –
ఉండాలి నిక్షేపంలా యింద్రునితో
ప్రాగ్దిక్కునకే పయనిస్తా – స్వర్గానికి నిచ్చెనవేస్తా
అదిగదిగో – వస్తున్నారు
రంభా – ఊర్వశి – మేనక – తిలోత్తమలు
ఇదిగిదిగో తెస్తున్నారు
స్వాగతహారతి – మంగళహారతి.

అయితే యేదో అశక్తత వన్నావరించింది –
అని ఒకడావేదన పడతాడు.

ఇంకొకడు –

హుం.... ఈ ప్రపంచంలో నరత్వం నశించింది
క్రూరత్వం వ్యాపించింది
ఉండలేనీ ప్రపంచంలో
నిలువలేనీ భూభాగంలో - అందుకే....
పోతాను - పోతాను ఎడారి దారిన పోతాను.
ముక్కుసూటిగా పోతాను - దిక్చక్రపు దరికే పోతాను.
కామక్రోధాలకు దూరంగా -
అనంత విశ్వంనుంచి అంతర్ధానమై పోతాను
ఆశనిరాశల పాశంనుంచీ -
జీవితబాధల బారినుంచీ -
పడమటికే పయనం కడతా -
మృత్యువుకే అంజలినిస్తా -
అని యింకొకడు మృత్యువు నారాధిస్తాడు

మరొకడు –

జీవన్నాటకంలో చివరి అంకం సమాప్తమౌతోంది.
అయింది గత స్మృతులని
నూతనం చేయడానికి ప్రయత్నం విఫలం
ఇహంలో సుఖంలేదు - వొట్టిచావు నాకఖ్ఖర్లేదు.
పోవాలి స్వర్గానికి బొందితో -
ఉండాలి నిక్షేపంలా యింద్రునితో వీ
ప్రాగ్దిక్కునకే పయనిస్తా - స్వర్గానికి నిచ్చెనవేస్తా చి
అదిగదిగో - వస్తున్నారు క
రంభా - ఊర్వశి - మేనక - తిలోత్తమలు లు
ఇదిగిదిగో తెస్తున్నారు ★
స్వాగతహారతి - మంగళహారతి. 25

మురికిగుంట నిర్మాణానికి పునాదులయిన
అశుభ్ర పదార్థాలూ, మలినపూరితమయిన నీరు
మొత్తానికి కల్మషం సృష్టించే మానవ బ్రహ్మలమీద,
వారి మురికిగుంట ఆలోచనలమీద,
నే నేమీ వ్రాయలేను.
పట్టపగలు చుక్కల్లా,
నీటిమూటలా మంచితనం మూటగట్టుకున్న మహాపురుషులూ,
రావిచెట్టూ, వేపచెట్టూ కలిపినట్టు
ప్రకృతిని యథేచ్ఛగా అనుభవించే మగమహారాజులు,
పెద్ద అమృతభాండంలో ఒకింత విషపుచుక్కలా,
అంతా తానే అనుభవించాలని చెట్టుకుచేరిన విషకీటకంలా,
ఈ మాయాజంజాట జగతిలో మసలుతున్నారని
నేను వ్రాయకూడదు.
మసలుతున్నంతవరకూ నేను వ్రాయలేను.

అమ్మాయి బుగ్గమీదపడిన సూర్యకిరణం
ఇంద్ర ధనస్సులా శోభించి,
పరువం తరుణాన్ని పుంజుకొని
కొత్త అందాన్ని తెచ్చుకొని
వాన వస్తోందని భ్రమించి
తురాయి విదిల్చి, పురికదిల్చి
మయూరి నాట్యం ఆడేలా చేసిందనీ,
అప్పుడు,
మేడమీంచి కనబడే కొబ్బరిచెట్టు మట్టల మధ్యల్లో
ఋణగ్రస్తుడై రాహుగ్రస్తుడిలా కనిపిస్తున్న చంద్రుడు
విలువతగ్గిన రూపాయిలా వెలవెలబోతున్నాడనీ
నేను వ్రాస్తే
'నాలో భావుకత లేదు!
మౌలికం, సృజనాత్మకం ఏమీ లేవు'
ఇది నే ననడంలేదు.

మురికిగుంట నిర్మాణానికి పునాదులయిన
అశుభ్ర పదార్థాలూ, మలినపూరితమయిన నీరు
మొత్తానికి కల్మషం సృష్టించే మానవ బ్రహ్మలమీద,
వారి మురికిగుంట ఆలోచనలమీద,
నే నేమీ వ్రాయలేను.
పట్టపగలు చుక్కల్లా,
నీటిమూటలా మంచితనం మూటగట్టుకున్న మహాపురుషులూ,
రావిచెట్టూ, వేపచెట్టూ కలిపినట్టు
ప్రకృతిని యధేచ్ఛగా అనుభవించే మగమహారాజులు,
పెద్ద అమృతభాండంలో ఒకింత విషపుచుక్కలా,
అంతా తానే అనుభవించాలని చెట్టుకుచేరిన విషకీటకంలా,
ఈ మాయాజంజాట జగతిలో మసలుతున్నారని
నేను వ్రాయకూడదు.
మసలుతున్నంతవరకూ నేను వ్రాయలేను.

అమ్మాయి బుగ్గమీదపడిన సూర్యకిరణం
ఇంద్ర ధనస్సులా శోభించి.
పరువం తరుణాన్ని పుంజుకొని
కొత్త అందాన్ని తెచ్చుకొని
వాన వస్తోందని భ్రమించి
తురాయి విదిల్చి, పురికదిల్చి
మయూరి నాట్యం ఆడేలా చేసిందనీ,
అప్పుడు,
మేడమీంచి కనబడే కొబ్బరిచెట్టు మట్టల మధ్యల్లో
ఋణగ్రస్తుడై రాహుగ్రస్తుడిలా కనిపిస్తున్న చంద్రుడు
విలువతగ్గిన రూపాయిలా వెలవెలబోతున్నాడనీ
నేను వ్రాస్తే
'నాలో భావుకత లేదు !
మౌలికం, సృజనాత్మకం ఏమీ లేవు'
ఇది నే ననడంలేదు.

'ళ్ళ' కారంతో పాదాంతాక్షరాలు కనిపిస్తే
అంత్యప్రాసలకై అఘోరించావన్నారు
పోనీండి।
అందంచూసే చూపెక్కడవాళ్ళకు ?
అందుకనే, ఆ మధ్య, ఒకచోట
శ్మశానం, చితి, కన్నీళ్ళు, బెకబెకలు చూసి
నాది అతిదారుణమయిన పదజాలం అన్నారు.
అసలుకారణం, ఆ కవితలు క్రొత్తవారిది ప్రచురిస్తే
చెత్తవారిదీ పత్రికంటారని భయంచెందేవారికి
పంపించడంవలననే, అయ్యుండచ్చు.
నేనేం వ్రాసేది ?
నేనేం చేసేది ?



## దాగుడుమూతలు

విలోకిద్దామనుకున్న విశాలనేత్రాలు
తెరచుకోని రెప్పల పరదాల వెనుక,
గుండ్రంగా గుడ్లు మిటకరిస్తున్నట్లు తిరుగుతున్నాయి.
నాలుక కొసదాకా ఉరుక్కుంటూ పరిగెత్తుకొచ్చిన మాటలు,
వెలుపలికురికే సాహసంలేక,
అక్కడక్కడె తచ్చాడుతున్నాయి.
వీ శరీరంలోని స్తబ్ధత, మాటలేని నిశ్శబ్దత,
చి కారణం ఏమిటో తెలుసుకుందామని,
క వీనులు కూడా దీసంగా మూగపోయివున్నాయి.
లు కలకలం చేస్తున్నాయి నా మస్తిష్కంలో.
★ నా కలంతో దాగుడుమూతలాడుతున్న భావాలు.





'ళ్ళ' కారంతో పాదాంతాక్షరాలు కనిపిస్తే
అంత్యప్రాసలకై అఘోరించావన్నారు
పోనీండి।
అందంచూసే చూపెక్కడవాళ్ళకు ?
అందుకనే, ఆ మధ్య, ఒకచోట
శ్మశానం, చితి, కన్నీళ్ళు, బెకబెకలు చూసి
నాది అతిదారుణమయిన పదజాలం అన్నారు.
అసలుకారణం, ఆ కవితలు క్రొత్తవారిది ప్రచురిస్తే
చెత్తవారిదీ పత్రికంటారని భయంచెందేవారికి
పంపించడంవలననే, అయ్యుండచ్చు.
నేనేం వ్రాసేది ?
నేనేం చేసేది ?



# దాగుడుమూతలు

విలోకిద్దామనుకున్న విశాలనేత్రాలు
తెరచుకోని రెప్పల పరదాల వెనుక,
గుండ్రంగా గుడ్లు మిటకరిస్తున్నట్లు తిరుగుతున్నాయి.
నాలుక కొనదాకా ఉరుక్కుంటూ పరిగెత్తుకొచ్చిన మాటలు,
వెలుపలికురికే సాహసంలేక,
అక్కడక్కడె తచ్చాడుతున్నాయి.
వీ శరీరంలోని స్థబ్ధత, మాటలేని నిశ్శబ్దత,
చి కారణం ఏమిటో తెలుసుకుందామని,
క వీనులు కూడా దీసంగా మూగపోయివున్నాయి.
లు కలకలం చేస్తున్నాయి నా మస్తిష్కంలో.
★ నా కలంతో దాగుడుమూతలాడుతున్న భావాలు.



# కలం కార్చిన కన్నీరు

పాళీ మధ్యస్థ నేత్రంనుంచి ఉప్పెనలా ముంచుకొచ్చి,
ముందుకు సరళరేఖగాసాగి,
నే రాస్తున్న కాగితంమీద ముద్దగా పడింది.
లోపల చైతన్యం ఎక్కువయిందో, తక్కువయిందో
నా కర్థం కాలేదు.
గొంతు విప్పి పరీక్షించాను.
పీకలదాకామెక్కిన (వి) నాయకుడిలానూ లేదు;
ఈకలా, దైన్యస్థితిని వెళ్లగక్కే నిరుపేదలానూ లేదు.
సామాన్యుడి భవిష్యత్తుపై ఆశలా -
అటుకాస్త, ఇటుకాస్త కనబడుతోంది

"ఎందుకీ ఏడుపు ?
నీకేమయింది" అని ప్రశ్నించా.
కలం గళం మూసుకొని కాసేపేమీ మాటాడలేదు.
తరువాత మెల్లగా అన్నట్టుంది.
"ఏడుపెందుకా ? నా స్థితి చూసుకొనే ! —
నా సంగతి నువ్వేం పట్టించుకోడం లేదు.
నీ భావాలకు, సరిఅయిన రూపాలను
కాయితంమీద పెట్టేందుకు,
నాచే నీవు చేయిస్తున్న శ్రమ, నా పరిశ్రమ నీకుతెలుసా ?
నా చేత వత్తివత్తి రాయిస్తున్నావే !
నన్నింత కష్టపెడుతూ
నువ్వేం మేలుచేసావు నాకు,
బిడ్డపుట్టినందుకు సంతోషిస్తావేకాని,
కన్నతల్లి ప్రసవవేదన, ఆలోచిస్తావా ?
నా వల్లనేకదా నువ్వో రచయితవయ్యావ్ !
నా శ్రమవల్లనేకాదా ఎన్నోమార్లు,
నీ పేరు అచ్చులో చూసుకున్నావ్ !
కథల్లో, నవలల్లో ప్రథమ బహుమతులు సంపాదించుకున్నావ్ !
మరి - నాకొకింత కృతజ్ఞతేనా చెప్పావా ?

# కలం కార్చిన కన్నీరు

పాళీ మధ్యస్థ నేత్రంనుంచి ఉప్పెనలా ముంచుకొచ్చి,
ముందుకు సరళరేఖగాసాగి,
నే రాస్తున్న కాగితంమీద ముద్దగా పడింది.
లోపల చైతన్యం ఎక్కువయిందో, తక్కువయిందో
నా కర్థం కాలేదు.
గొంతు విప్పి పరీక్షించాను.
పీకలదాకామెక్కిన (వి) నాయకుడిలానూ లేదు;
ఈకలా, దైన్యస్థితిని వెళ్లగక్కే నిరుపేదలానూలేదు.
సామాన్యుడి భవిష్యత్తుపై ఆశలా -
అటుకాస్త, ఇటుకాస్త కనబడుతోంది

"ఎందుకీ ఏడుపు ?
నీకేమయింది" అని ప్రశ్నించా.
కలం గళం మూసుకొని కాసేపేమీ మాటాడలేదు.
తరువాత మెల్లగా అన్నట్టుంది.
"ఏడుపెందుకా ? నా స్థితి చూసుకొనే ! —
నా సంగతి నువ్వేం పట్టించుకోడం లేదు.
నీ భావాలకు, సరిఅయిన రూపాలను
కాయితంమీద పెట్టేందుకు,
నాచే నీవు చేయిస్తున్న శ్రమ, నా పరిశ్రమ నీకుతెలుసా ?
నా చేత వత్తివత్తి రాయిస్తున్నావే !
నన్నింత కష్టపెడుతూ
నువ్వేం మేలుచేసావు నాకు,
బిడ్డపుట్టినందుకు సంతోషిస్తావేకాని,
కన్నతల్లి ప్రసవవేదన, ఆలోచిస్తావా ?
నా వల్లనేకదా నువ్వో రచయితవయ్యావ్ !
నా శ్రమవల్లనేకాదా ఎన్నోమార్లు,
నీ పేరు అచ్చులో చూసుకున్నావ్ !
కథల్లో, నవలల్లో ప్రథమ బహుమతులు సంపాదించుకున్నావ్ !
మరి - నాకొకింత కృతజ్ఞతేనా చెప్పావా ?

ఒక్కసారేనా గాఢంగా హృదయానికి హత్తుకున్నావా ?
ఈ కలమే నా కిలలో ఇలా పేరు తెచ్చిందని ఒక్కమారేనా అన్నావా ?

ఓనాడు -
తొలుత ఎంతో సంతోషించాను.
ఆ రోజు ఉదయం నీ మిత్రుడు వచ్చి
"కలంపేరు"న నువ్వు రాసిన కధకు
ప్రథమ బహుమతి వచ్చిందంటే,
అది నా పేరనుకున్నాను,
నాకే వచ్చిందనుకున్నాను.
నా కథే అనుకున్నాను
తీరాచూస్తే, అది నా పేరుకాదు
నువ్వు అన్యాయం చేశావనిపించింది,
అయినా వూరుకున్నాను.
నీవు పట్టించుకోని నా గోడుగురించి ఆలోచిస్తూ -
పరధ్యానంలోవుండి, మాటకుబదులు ముద్దగా జారితే
గొంతు నులిమినట్లు మెలిత్రిప్పి,
కసితో తిట్టుకుంటూ చూస్తావా ?
ఏడాదిగా నీకు నే నార్జించి యిచ్చిన
కీర్తికి ప్రతిఫలం గదూ ఇది !
నీకు న్యాయం తెలీదు."

కలం కన్నీరు కార్చింది
ముద్దగా, బొట్లుబొట్లుగా కార్చింది.
నా బ్లాటింగ్ రుమాలుతో
కలం కన్నీరు తుడిచాను.
నేనూ కన్నీరు కార్చాను.
నీ బాగోగులు నే చూస్తానని హామీ యిచ్చాను.



ఒక్కసారేనా గాఢంగా హృదయానికి హత్తుకున్నావా ?
ఈ కలమే నా కిలలో ఇలా పేరు తెచ్చిందని ఒక్కమారేనా అన్నావా ?

ఓనాడు -
తొలుత ఎంతో సంతోషించాను.
ఆ రోజు ఉదయం నీ మిత్రుడు వచ్చి
"కలంపేరు"న నువ్వు రాసిన కథకు
ప్రథమ బహుమతి వచ్చిందంటే,
అది నా పేరనుకున్నాను,
నాకే వచ్చిందనుకున్నాను.
నా కథే అనుకున్నాను
తీరాచూస్తే, అది నా పేరుకాదు
నువ్వు అన్యాయం చేశావనిపించింది,
అయినా వూరుకున్నాను.
నీవు పట్టించుకోని నా గోడుగురించి ఆలోచిస్తూ -
పరధ్యానంలోవుండి, మాటకుబదులు ముద్దగా జారితే
గొంతు నులిమినట్లు మెలిత్రిప్పి,
కసితో తిట్టుకుంటూ చూస్తావా ?
ఏడాదిగా నీకు నే నార్జించి యిచ్చిన
కీర్తికి ప్రతిఫలం గదూ ఇది !
నీకు న్యాయం తెలీదు."

కలం కన్నీరు కార్చింది
ముద్దగా, బొట్లుబొట్లుగా కార్చింది.
నా బ్లాటింగ్ రుమాలుతో
కలం కన్నీరు తుడిచాను.
నేనూ కన్నీరు కార్చాను.
నీ బాగోగులు నే చూస్తానని హామీ యిచ్చాను.

## వంగపల్లి విశ్వనాథం

జననం : జనవరి 11, 1941. ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి 1961 లో వాణిజ్యశాస్త్ర పట్టభద్రులు. ప్రస్తుతం సికిందరాబాద్ కళాశాలలో వాణిజ్య శాస్త్రోపన్యాసకులు.

"ఇందులో ఏ భావానికయినా మారోమారు చదివించుకునే భాగ్యం దక్కితే, అనుభవాలు నింపిన, అనుభూతుల్ని పంచుకున్నట్లు, — నా బరువు తీరినట్లు, నా భాగ్యం పండినట్లు భావిస్తాను."

— విశ్వనాథం.

# వంగపల్లి విశ్వనాథం

జననం : జనవరి 11, 1941. ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి 1961 లో వాణిజ్యశాస్త్ర పట్టభద్రులు. ప్రస్తుతం సికిందరాబాద్ కళాశాలలో వాణిజ్య శాస్త్రోపన్యాసకులు.

"ఇందులో ఏ భావానికయినా మారోమారు చదివింపించుకునే భాగ్యం దక్కితే, అనుభవాలు నింపిన, అనుభూతుల్ని పంచుకున్నట్లు, — నా బరువు తీరినట్లు, నా భాగ్యం పండినట్లు భావిస్తాను."

— విశ్వనాథం.

# వానచుక్కతో నా స్వాగతం !

సన్నటి జల్లుగా, పన్నీటి జల్లుగా,
నవ్వులు ఒలకబోస్తూన్న అప్సరసలు చిలుకరిస్తూన్న అమృతంపు జల్లుగా
తుంపర పడుతూవుంటే....? మనసెటో పోతుంది!
ఆ తొలితొలి తొలకరి తుంపరలో నడవాలని,
కాదు- ఎగిరి గంతులెయ్యాలని,
కాదు- ఆనందంతో నృత్యం చేయాలనిపిస్తుంది.
మంచి మనిషి మనసునుండి కురిసిన, చిరునవ్వుల మల్లెమొగ్గల జల్లుగా
కురుస్తూన్న ఆ జల్లులో నడుస్తూవుంటే! -
ఎవరో ముత్యాల స్నానం చేయిస్తున్నట్టుంటుంది.
వలచి వలపించుకొన్న ప్రేయసి పూసిన
మంచిగంధపు మైపూతలా వుంటుంది.
అందుకనే, సన్నటి తెల్లటి బట్టలు వేసుకుని,
ఆ తేనెల సోనల వానలో, అలా అలా తిరిగి వచ్చేవాళ్ళ
రసదృష్టి. కళాదృష్టి ఎలా వర్ణించగలను ?
పడిన కాసిన్ని జల్లులకే, సంబరంతో పండుగచేసుకుంటున్నట్టు -
అల్పసంతోషిలా వంటి కంటుకుపోయి,
వయసు లావణ్యాల వంపుసొంపులను కనువిందుగా అందించడం -
తెల్లటి బట్టలకు చాతయినంతగా, మరివేటికీ చేతకాదు.
అందుకే! వానాకాలంలో
సన్నటి తెల్లటి బట్టలు కట్టుకున్నవాళ్ళంటే నాకెంతోయిష్టం.

*****

ఈ నాగరికతారణ్యంలోంచి, నిజంగా అరణ్యంలోకి
పరిగెత్తి పారిపోదామనిపిస్తుంది.
మేఘాల దుప్పటి కప్పుకుని, మొహం చాటుచేసుకున్న
సప్తాశ్వరధికుణ్ణి చూసి, మనసారా నవ్వాలనిపిస్తుంది.
నెమళ్ళ చెవుల్లో రహస్యం చెప్పి, -
పురివిదిల్చి నాట్యం చేయమని, వాటికి నాట్యభంగిమలను నేర్పి
ప్రకృతీలలామకు నాట్యానైవేద్యమిమ్మని పురికొల్పాలనిపిస్తుంది.

# వానచుక్కతో నా స్వగతం !

సన్నటి జల్లుగా, పన్నీటి జల్లుగా,
నవ్వులు ఒలకబోస్తూన్న అప్సరసలు చిలుకరిస్తూన్న అమృతంపు జల్లుగా
తుంపర పడుతూవుంటే....? మనసెటో పోతుంది !
ఆ తొలితొలి తొలకరి తుంపరలో నడవాలని,
కాదు- ఎగిరి గంతులెయ్యాలని,
కాదు- ఆనందంతో నృత్యం చేయాలనిపిస్తుంది.
మంచి మనిషి మనసునుండి కురిసిన, చిరునవ్వుల మల్లెమొగ్గల జల్లుగా
కురుస్తూన్న ఆ జల్లులో నడుస్తూవుంటే ! -
ఎవరో ముత్యాల స్నానం చేయిస్తున్నట్టుంటుంది.
వలచి వలపించుకొన్న ప్రేయసి పూసిన
మంచిగంధపు మైపూతలా వుంటుంది.
అందుకనే, సన్నటి తెల్లటి బట్టలు వేసుకుని,
ఆ తేనెల సోనల వానలో, అలా అలా తిరిగి వచ్చేవాళ్ళ
రసదృష్టి. కళాదృష్టి ఎలా వర్ణించగలను ?
పడిన కాసిన్ని జల్లులకే, సంబరంతో పండుగచేసుకుంటున్నట్టు -
అల్పసంతోషిలా వంటి కంటుకుపోయి,
వయసు లావణ్యాల వంపుసొంపులను కనువిందుగా అందించడం -
తెల్లటి బట్టలకు చాతయినంతగా, మరివేటికీ చేతకాదు.
అందుకే ! వానాకాలంలో
సన్నటి తెల్లటి బట్టలు కట్టుకున్నవాళ్ళంటే నా కెంతోయిష్టం.

*****

ఈ నాగరికతారణ్యంలోంచి, నిజంగా అరణ్యంలోకి
పరిగెత్తి పారిపోదామనిపిస్తుంది.
మేఘాల దుప్పటి కప్పుకుని, మొహం చాటుచేసుకున్న
సప్తాశ్వరధికుణ్ణి చూసి, మనసారా నవ్వాలనిపిస్తుంది.
నెమళ్ళ చెవుల్లో రహస్యం చెప్పి, -
పురివిదిల్చి నాట్యం చేయమని, వాటికి నాట్యభంగిమలను నేర్పి
ప్రకృతీలలామకు నాట్యనైవేద్యమిమ్మని పురికొల్పాలనిపిస్తుంది.

కలుగుల్లోకి, బొరియల్లోకి, దాక్కునేందుకు దూసుకుపోయే కుందేళ్ళను,
పేరు పేరునా పిలిచి, మనసారా మెయినిమిరి,
మృదువుగా ముద్దెట్టుకుని, మరీ వదిలిపెట్టాలనిపిస్తుంది.
మేఘమల్హార్, మేఘరంజనీ రాగాల సమ్మిశ్రమంతో
మరో మనోరంజనీ రాగం సృష్టించి –
నీకు వాద్య నీరాంజనము ఇవ్వాలనిపిస్తుంది.

*****

కుండపోతగా కురిసి,
పర్వత శిఖరాగ్రాలకు అభ్యంగన స్నానం చేయిస్తున్నట్టు –
ఆ దాపున్నే పెరిగిన దేవదారు వృక్షాలకు,
చలిచలి చక్కిలిగింతలు పెట్టి, నవ్వాపుకోలేక తలలూపేట్టు
కొమ్మలను చిటారు రెమ్మలను పులకరించేట్లు వూపి,
అప్పటి కప్పుడే వేలుమందాన పాకడం మొదలెట్టి –
ఝురులుగా, సెలయేళ్ళుగా, యేళ్ళుగా, నదులుగా, మహానదులుగా
నిమ్నగలుగా మారిపోయే నీటిచుక్కకి
మనసారా చెయ్యెత్తి నమస్కరించాలనిపిస్తుంది.
“నీవు నీటిచుక్కవి
ప్రాణం నింపుకున్న జలదకన్యవి.
ప్రాణానికి ప్రాణంపోసే ఉనికివి.
మా మనుగడకూ, నాగరికతకూ ఆధారానివి.
సృష్టాద్యంతాలలో సర్వస్వానివి.
సృష్టివలయానికి కేంద్రానివి” అని స్తుతించాలనిపిస్తుంది.

*****

జలజలా జారినా – పూలజల్లుగా జాలువారినా –
ఆ నడకలో ఎంత అందం! ఎన్ని హొయలు!! ఎన్ని లయలు!!!
ఆ చినుకు, అలా కిందికి దిగి, నేలను తాకేలోపల –
ఎన్ని నయగారాలు పోతుందని!
అలా అలా పేరుకుపోయి –
ఆకుపచ్చని ఆకుల అంచుల మీదనుంచి
ఒక్కొక్కటి ఒక్కొక్కటిగా గెంతుతూ దూకే

కలుగుల్లోకి, బొరియల్లోకి, దాక్కునేందుకు దూసుకుపోయే కుందేళ్ళను,
పేరు పేరునా పిలిచి, మనసారా మెయినిమిరి,
మృదువుగా ముద్దెట్టుకుని, మరీ వదిలిపెట్టాలనిపిస్తుంది.
మేఘమల్హార్, మేఘరంజనీ రాగాల సమ్మిశ్రమంతో
మరో మనోరంజనీ రాగం సృష్టించి –
నీకు వాద్య నీరాంజనము ఇవ్వాలనిపిస్తుంది.

*****

కుండపోతగా కురిసి,
పర్వత శిఖరాగ్రాలకు అభ్యంగన స్నానం చేయిస్తూన్నట్టు –
ఆ దాపున్నే పెరిగిన దేవదారు వృక్షాలకు,
చలిచలి చక్కిలిగింతలు పెట్టి, నవ్వాపుకోలేక తలలూపేట్టు
కొమ్మలను చిటారు రెమ్మలను పులకరించేట్లు వూపి,
అప్పటి కప్పుడే వేలుమందాన పాకడం మొదలెట్టి –
ఝరులుగా, సెలయేళ్ళుగా, యేళ్ళుగా, నదులుగా, మహానదులుగా
నిమ్నగలుగా మారిపోయే నీటిచుక్కకి
మనసారా చెయ్యెత్తి నమస్కరించాలనిపిస్తుంది.
"నీవు నీటిచుక్కవి
ప్రాణం నింపుకున్న జలదకన్యవి.
ప్రాణానికి ప్రాణంపోసే ఉనికివి.
మా మనుగడకూ, నాగరికతకూ ఆధారానివి.
సృష్టాద్యంతాలలో సర్వస్వానివి.
సృష్టివలయానికి కేంద్రానివి" అని స్తుతించాలనిపిస్తుంది.

*****

జలజలా జారినా – పూలజల్లుగా జాలువారినా –
ఆ నడకలో ఎంత అందం! ఎన్ని హొయలు!! ఎన్ని లయలు!!!
ఆ చినుకు, అలా కిందికి దిగి, నేలను తాకేలోపల –
ఎన్ని నయగారాలు పోతుందని!
అలా అలా పేరుకుపోయి –
ఆకుపచ్చని ఆకుల అంచుల మీదనుంచి
ఒక్కొక్కటి ఒక్కొక్కటిగా గెంతుతూ దూకే

చిన్ని చినుకులు — ఎంత అందంగా వుంటాయి!
బిడియపడుతూ బిడియపడుతూ జారి,
మా కిటికీ చువ్వల అడ్డతీగలపై కాసేపు కాలూని,
ముత్యాల తోరణాలుగా మెరుస్తూ మారి,
మా తలపుల్లో, దీపావళీ ప్రమిదల తోరణాలను తలపించి,
వూహల్లో కాపురం చేసి జారిన భావాల తోరణాల్లా
జారిపోతావు నేలపైకి — నునుమెత్తని గడ్డిపోచలపైకి.

*****

ఆస్తిపాస్తులు హ్రస్వమైన బీదల పాట్లకు,
అంబరం కంటతడి పెట్టినట్లు భోరున కురుస్తూ —
అంతలోనే —
అక్కడ కురిసిన నీటిలో,
కాగితం పడవలతో ఆడుకుందామనుకుంటూన్న
పాపంసోకని పాలబుగ్గల లేతదనాల్ని చూసి,
జల్లుగా మారుతూ -
ఎంత కరుణా సముద్ర తాను ?

మిన్ను నుండి జలజలా జారు జలతారు తీగెల్లా మన్నుపై జారి,
నింగినుండి నింపుకువచ్చిన అమృతభాండాలు ఒలకపోస్తున్నట్లుగా
నేలపై పారి,
ధరిత్రీహృదయపు లోలోపలి పొరల్లోనికి చొచ్చుకొనిపోయి,
మొలకలుగా, విచ్చుకున్న ముత్యాల వెన్నులుగా జొచ్చుకొని వచ్చి,
కృతజ్ఞతతో నింగికి నీరాంజనాలిచ్చి,
పుట్టినింటికీ, మెట్టినింటికీ ఖ్యాతి తెచ్చి,
విత్తనంనాటినవాడి మొహాన చిరునవ్వుల తోరణాలు పేర్చి,
వర్షం కాదు, ఇది హర్షం అనిపించుకున్నావు.
నీవు ధన్యవు.

నడినెత్తిపై దుమికి, నడిమి పాపిట నడిచి,
నుదుటి ఎఱ్ఱని కుంకుమకు కొత్త వర్ణాల నిచ్చి —
కనుబొమకూ కనుబొమకూ మధ్యగా కస్తూరీ తిలకంగా మారి,
సంపెంగలాంటి ముక్కుపైనుండి జారి -

చిన్ని చినుకులు – ఎంత అందంగా వుంటాయి!
బిడియపడుతూ బిడియపడుతూ జారి,
మా కిటికీ చువ్వల అడ్డతీగలపై కాసేపు కాలూని,
ముత్యాల తోరణాలుగా మెరుస్తూ మారి,
మా తలపుల్లో, దీపావళీ ప్రమిదల తోరణాలను తలపించి,
వూహల్లో కాపురం చేసి జారిన భావాల తోరణాల్లా
జారిపోతావు నేలపైకి – నునుమెత్తని గడ్డిపోచలపైకి.

*****

ఆస్తిపాస్తులు హ్రస్వమైన బీదల పాట్లకు,
అంబరం కంటతడి పెట్టినట్లు భోరున కురుస్తూ –
అంతలోనే –
అక్కడ కురిసిన నీటిలో,
కాగితం పడవలతో ఆడుకుందామనుకుంటూన్న
పాపంసోకని పాలబుగ్గల లేతదనాల్ని చూసి,
జల్లుగా మారుతూ –
ఎంత కరుణా సముద్ర తాను ?

మిన్ను నుండి జలజలా జారు జలతారు తీగెల్లా మన్నుపై జారి,
నింగినుండి నింపుకువచ్చిన అమృతభాండాలు ఒలకపోస్తున్నట్లుగా
నేలపై పారి,
ధరిత్రీహృదయపు లోలోపలి పొరల్లోనికి చొచ్చుకొనిపోయి,
మొలకలుగా, విచ్చుకున్న ముత్యాల వెన్నులుగా జొచ్చుకొని వచ్చి,
కృతజ్ఞతతో నింగికి నీరాంజనాలిచ్చి,
పుట్టినింటికీ, మెట్టినింటికీ ఖ్యాతి తెచ్చి,
విత్తనంనాటినవాడి మోహాన చిరునవ్వుల తోరణాలు పేర్చి,
వర్షం కాదు, ఇది హర్షం అనిపించుకున్నావు.
నీవు ధన్యవు.

నడినెత్తిపై దుమికి, నడిమి పాపిట నడిచి,
నుదుటి ఎఱ్ఱని కుంకుమకు కొత్త వర్ణాల నిచ్చి –
కనుబొమకూ కనుబొమకూ మధ్యగా కస్తూరీ తిలకంగా మారి,
సంపెంగలాంటి ముక్కుపైనుండి జారి –

ఇక ముందుకు సాగిపోదామనుకుంటున్న తరుణంలో –
నిన్ను తుడిచివేసే చెయ్యిని చూసి, నీవు కోపం తెచ్చుకోవు.
మెచ్చుకోలు కోసమని కాదు ; నిజం చెబుతున్నాను –
నీవు శాంతవు ! అపర శాంతవు !!

దివినుండి భువిపైకి జారుతూన్నప్పుడు,
నీవెక్కడ కందిపోతావోనని,
నీవెక్కడ చింది చిట్లిపోతావోనని,
తమ సుతిమెత్తని రెక్కలతో నిన్ను అందిపుచ్చుకున్న
పూలకన్నెలతో నేస్తం నెఱపి,
తియ్యని స్నేహానుభూతులు గఱిపి,
లేలేత హృదయాన్నుండి, ఉదరంలోకి పారి,
తియ్యటి మధువుగా మారి,
తేటికి స్వాగతం పలికి,
పూలకన్నియతో పరిణయం జరిపి,
నీ ఋణం తీర్చుకుంటావు.
ఎంత కృతజ్ఞతాభావం నీది !

*****

కరుణ కదలి కారిన నీరు కాబట్టే – కన్నీరు అంటారనుకుంటాను.
ప్రకృతిమాత కార్చిన దుఃఖాశ్రువులో, ఆనందాశ్రువులో,
తడి ఎండిన కన్నులో ....... ?
మాకు అతివృష్టి, సమవృష్టి అనావృష్టిగా అవతరిస్తాయి.
తనకు పక్షపాతం లేదు ! ఎంతటి సమదృష్టి !!
మహానదిపై కురిసినా, మురికి కాల్వలో పడినా –
స్వాతి చినుకుగా ముత్తెపుచిప్పలో దూరి ముత్తెమయినా –
వీ తాను అదే అనురాగంతో దరిజేరుతుంది.
చి నులి వెచ్చని కౌగిలి నొసగి, నొదిగి వొదిగి పోతుంది.
క తన ప్రణయానికి ఏకైకసాక్ష్యమైన మల్లెపందిరిని ప్రేమతోచూసి,
లు తీగె తనువు పులకరించేట్లు వూపి,
★ జారిన మల్లెలను మాలగా కట్టి, సిగలో ఏటవాలుగా చుట్టి
 నవ్వుతూ నిరీక్షిస్తూన్న ప్రణయిని జడలో –

ఇక ముందుకు సాగిపోదామనుకుంటున్న తరుణంలో —
నిన్ను తుడిచివేసే చెయ్యిని చూసి, నీవు కోపం తెచ్చుకోవు.
మెచ్చుకోలు కోసమని కాదు ; నిజం చెబుతున్నాను.
నీవు శాంతవు ! అపర శాంతవు !!

దివినుండి భువిపైకి జారుతూన్నప్పుడు,
నీవెక్కడ కందిపోతావోనని,
నీవెక్కడ చింది చిట్లిపోతావోనని,
తమ సుతిమెత్తని రెక్కలతో నిన్ను అందిపుచ్చుకున్న
పూలకన్నెలతో నేస్తం నెఱిపి,
తియ్యని స్నేహానుభూతులు గఱిపి,
లేలేత హృదయాన్నుండి, ఉదరంలోకి పారి,
తియ్యటి మధువుగా మారి,
తేటికి స్వాగతం పలికి,
పూలకన్నియతో పరిణయం జరిపి,
నీ ఋణం తీర్చుకుంటావు.
ఎంత కృతజ్ఞతాభావం నీది !

*****

కరుణ కదలి కారిన నీరు కాబట్టే — కన్నీరు అంటారనుకుంటాను.
ప్రకృతిమాత కార్చిన దుఃఖాశ్రువులో, ఆనందాశ్రువులో,
తడి ఎండిన కన్నులో ....... ?
మాకు అతివృష్టి, సమవృష్టి అనావృష్టిగా అవతరిస్తాయి.
తనకు పక్షపాతం లేదు ! ఎంతటి సమదృష్టి !!
మహానదిపై కురిసినా, మురికి కాల్వలో పడినా —
స్వాతి చినుకుగా ముత్తెపుచిప్పలో దూరి ముత్తెమయినా —
తాను అదే అనురాగంతో దరిజేరుతుంది.
నులి వెచ్చని కౌగిలి నొసగి, నొదిగి వొదిగి పోతుంది.
తన ప్రణయానికి ఏకైకసాక్ష్యమైన మల్లెపందిరిని ప్రేమతోచూసి,
తీగె తనువు పులకరించేట్లు పూసి,
జారిన మల్లెలను మాలగా కట్టి, సిగలో ఏటవాలుగా చుట్టి
నవ్వుతూ నిరీక్షిస్తున్న ప్రణయిని జడలో —

మురుస్తూ విరుస్తూన్న మల్లె మొగ్గలోబడి,
సుతిమెత్తని రేకుల ఒడిలో దూరిన
ఆ చిన్నారి చినుకు అదృష్టం –
అసూయను రేకెత్తిస్తోంది.
తాను మధువుగా మారి మత్తెక్కిస్తోంది.
తన తలపులకు దేవతల దీవెనలుగా, తలంబ్రాలుగా కురుస్తోంది.

అప్పుడప్పుడూ –
తరంగానికీ తరంగానికీ మధ్య దూరి
చక్కిలిగింతల తతంగం జరిపి
చెలియలికట్టకు గిలిగింతలు పెట్టుంది చినుకు !
చెలి తలపులకూ గిలిగింత పెట్టుంది చినుకు !
జల తరంగంలా ధ్వనిస్తూ,
నూపురనాదంలా ప్రతిధ్వనిస్తూ,
మిసమిసలాడే పరువంలా కురుస్తూ
ప్రణయం పరాకాష్ట నందిన,
గతరాత్రి అనుభూతుల్ని నెమరువేస్తూ నడుస్తూన్న
జవరాలి ధమ్మిల్ల తమోమర్మంలో దూరి,
నఖక్షతాలకూ, దంతక్షతాలకూ అనుభవాల జ్ఞాపకాలను రేపి,
విరహాగ్ని రగిల్చి, మరీ, వింతచూసే నిన్ను ఏమనాలి ?
ఎంత చిలిపిదానవు నీవు ? కాకపోతే –
"చిటపట చినుకులు దుప్పటి తడసెను, తలుపు తీయవె భామా !"
అన్న పాటకు ఆధారమౌతావు ?
అంత చిలిపివి కాకపోతే –
చెలి సాంగత్యానికి కారణమెలా అవుతావు ?
కోరికలు రేపి, ఆ రేపిన కోరికలకు పాఠాలు నేర్పి
పూరించగల్గుతావు ?
అంత చిలిపివి గాబట్టే, అలా కవ్వించగలుగుతావు.

*****

మురుస్తూ విరుస్తూన్న మల్లె మొగ్గలోబడి,
సుతిమెత్తని రేకుల ఒడిలో దూరిన
ఆ చిన్నారి చినుకు అదృష్టం –
అసూయను రేకెత్తిస్తోంది.
తాను మధువుగా మారి మత్తెక్కిస్తోంది.
తన తలపులకు దేవతల దీవెనలుగా, తలంబ్రాలుగా కురుస్తోంది.

అప్పుడప్పుడూ –
తరంగానికీ తరంగానికీ మధ్య దూరి
చక్కిలిగింతల తతంగం జరిపి
చెలియలికట్టకు గిలిగింతలు పెట్టుంది చినుకు !
చెలి తలపులకూ గిలిగింత పెట్టుంది చినుకు !
జల తరంగంలా ధ్వనిస్తూ,
నూపురనాదంలా ప్రతిధ్వనిస్తూ,
మిసమిసలాడే పరువంలా కురుస్తూ
ప్రణయం పరాకాష్ట నందిన,
గతరాత్రి అనుభూతుల్ని నెమరువేస్తూ నడుస్తూన్న
జవరాలి ధమ్మిల్ల తమోమర్మంలో దూరి,
నఖక్షతాలకూ, దంతక్షతాలకూ అనుభవాల జ్ఞాపకాలను రేపి,
విరహాగ్ని రగిల్చి, మరీ, వింతచూసే నిన్ను ఏమనాలి ?
ఎంత చిలిపిదానవు నీవు ? కాకపోతే –
"చిటపట చినుకులు దుప్పటి తడసెను, తలుపు తీయవె భామా !"
అన్న పాటకు ఆధారమౌతావు ?
అంత చిలిపివి కాకపోతే – వీ
చెలి సాంగత్యానికి కారణమెలా అవుతావు ? చి
కోరికలు రేపి, ఆ రేపిన కోరికలకు పాఠాలు నేర్పి క
పూరించగల్గుతావు ? లు
అంత చిలిపివి గాబట్టే, అలా కవ్వించగలుగుతావు. ★

*****

ఆకాశానికి చిల్లులు పడ్డట్టు — ఎవరో ముత్యాలజల్లెడ పట్టి,
చిన్న సైజు ముత్యాలను వేరుచేస్తున్నట్టు అనిపిస్తుంది.
భగవంతుని 'ఫ్రిజ్' లోంచి ఐస్‌క్యూబులు దొర్లిపడుతున్నట్లనిపిస్తుంది.
అడపా దడపా వడగళ్ళుగా పడతావు.
చేతుల్లోకి తీసుకున్నంతసేపు కూడా వుండవు.
నోట్లో కరిగేందుకు కూడా ఆగవు.
ఏం తొందరో మరి! కొంపలు కురిసేట్టు ధ్వనిస్తూ కురిసి,
కొంపలు మునిగేలా కరిగి మాయమౌతావు.

పగలల్లా వగల వయ్యారాలను ఒలకబోసి,
ఆ రాత్రికి — ఇక వదలనంటూ —
విడవకుండా కుంభవృష్టిగా వచ్చే నిన్ను ఏమనాలి?
మా అవసరాలను నీ ఆనందంలో మరుస్తావు గాబోలు!
నాగరికతా నడిరోడ్లపై మిల మిలా మెరుస్తూ నృత్యం చేసే నీవు —
ఈ నాగరికతకు కూడు పెట్టే,
పంటపొలాల సంగతి మరుస్తూంటావు అప్పుడప్పుడు.
అలా వద్దు!
నాగరికతకు నీరు పోసిన నీటి చుక్కా! మా మనుగడ మరువకు!

నా ఆత్మలింగానికి సహస్రఘటాభిషేకం చేస్తాను.
ఇదుగో నీకు సహస్ర అక్షరాభిషేకం చేస్తున్నాను.
రావూ, మరి!

అదుగో — ఆకాశం స్రవిస్తోంది! ప్రసవిస్తోంది!!
కరుణ ద్రవిస్తోంది!!!



## మట్టికణం

వీ కనీసం క్షణంకోసం అయినా ఆగనికాలం
ధి ఒక్కోసారి, స్తంభించినట్లు నిలిచిపోతుంది.
క అతిప్రచండ మనోవేగాన్ని తలదన్నేట్టు పరిగెత్తుతూండే
లు ఈ నిర్విరామ ప్రవాహానికి అంతమెక్కడో? అర్థమేమిటో?
★ అంతుపట్టదు,
 ఆ ప్రవాహంలో ఒక బిందువు ఈ జీవితం.

ఆకాశానికి చిల్లులు పడ్డట్టు — ఎవరో ముత్యాలజల్లెడ పట్టి,
చిన్న సైజు ముత్యాలను వేరుచేస్తున్నట్టు అనిపిస్తుంది.
భగవంతుని 'ఫ్రిజ్' లోంచి ఐస్‌క్యూబులు దొర్లిపడుతున్నట్లనిపిస్తుంది.
అడపా దడపా వడగళ్ళుగా పడతావు.
చేతుల్లోకి తీసుకున్నంతసేపు కూడా వుండవు.
నోట్లో కరిగేందుకు కూడా ఆగవు.
ఏం తొందరో మరి! కొంపలు కురిసేట్టు ధ్వనిస్తూ కురిసి,
కొంపలు మునిగేలా కరిగి మాయమౌతావు.

పగలల్లా వగల వయ్యారాలను ఒలకబోసి,
ఆ రాత్రికి — ఇక వదలనంటూ —
విడవకుండా కుంభవృష్టిగా వచ్చే నిన్ను ఏమనాలి?
మా అవసరాలను నీ ఆనందంలో మరుస్తావు గాబోలు!
నాగరికతా నడిరోడ్లపై మిల మిలా మెరుస్తూ నృత్యం చేసే నీవు —
ఈ నాగరికతకు కూడుపెట్టే,
పంటపొలాల సంగతి మరుస్తుంటావు అప్పుడప్పుడు.
అలా వద్దు!
నాగరికతకు నీరు పోసిన నీటి చుక్కా! మా మనుగడ మరువకు!

నా ఆత్మలింగానికి సహస్రఘటాభిషేకం చేస్తాను.
ఇదుగో నీకు సహస్ర అక్షరాభిషేకం చేస్తున్నాను.
రావూ, మరి!

అదుగో — ఆకాశం స్రవిస్తోంది! ప్రసవిస్తోంది!!
కరుణ ద్రవిస్తోంది!!!



## మట్టికణం

వీ  కనీసం క్షణంకోసం అయినా ఆగనికాలం
చి  ఒక్కోసారి, స్తంభించినట్లు నిలిచిపోతుంది.
క  అతిప్రచండ మనోవేగాన్ని తలదన్నేట్లు పరిగెత్తుతూండే
లు  ఈ నిర్విరామ ప్రవాహానికి అంతమెక్కడో? అర్థమేమిటో?
★  అంతుపట్టదు,
ఆ ప్రవాహంలో ఒక బిందువు ఈ జీవితం.

చుట్టూరా ఆవరించుకునివున్న కొండలు,
ఏ భావాన్ని స్ఫురింపజేస్తాయో, అర్థం చేసుకోవడానికి ఆలోచిస్తున్నాను.
కొండలు ప్రకృతిలో భాగం.
అందంగా, ఎత్తుగా, ఆకాశాన్ని అందుకుంటున్నట్టు -
పచ్చగా, కన్నులపండువుగా. ప్రాణం నింపుకున్న వనకన్యలా
గాలికి వూగుతూన్న చెట్ల తలలతో
'రారమ్మని' ఆహ్వాన గీతాలు పాడుతూన్నట్లు -
అవే కొండలు. -
భారంగా, బరువుగా,
కదలలేక, ముందుకు అడుగువేయలేక,
విధి క్రూరశాపాన్ని అనుభవిస్తున్న శోకమూర్తిలా,
అవేదన పెల్లుబికిన వేదనామూర్తిలా -
కన్నీటిధారలు కారుస్తూ — శిలయై,
హృదయపు పగుళ్ళు తెచ్చిన అందవికారపు రూపంతో -
శిల్పానికి పనికిరాని వికృతమూర్తియై....
అవే కొండలు.

*****

నేను - ఒక మట్టికణాన్ని.
నవ్వడం నేర్చుకున్నాను.
అందమైన గులాబీపువ్వునయ్యాను.

నేనూ ఒక మట్టికణాన్ని.
నవ్వడం నేర్చుకోలేకపోయాను.
కఠినమైన నల్లని శిలనైయాను.

అదృష్టం అందివచ్చింది.
అందమైన శిల్పి హస్తసంస్పర్శతో రూపం దాల్చాను.
నాకు ప్రాణం పోయలేని నా సృష్టికర్త,
తన ఆరాధననీ, అనురాగాన్నీ వ్యక్తం చేసేందుకుకాబోలు
ఆ గులాబీపువ్వుతో మోకరిల్లాడు.

నేనూ ఒక మట్టికణాన్ని.
ఏడ్చిఏడ్చి బొంగురుపోయిన గొంతుతో "బొంగు" నయ్యాను.

చుట్టూరా ఆవరించుకునివున్న కొండలు,
ఏ భావాన్ని స్ఫురింపజేస్తాయో, అర్థం చేసుకోవడానికి ఆలోచిస్తున్నాను.
కొండలు ప్రకృతిలో భాగం.
అందంగా, ఎత్తుగా, ఆకాశాన్ని అందుకుంటున్నట్టు -
పచ్చగా, కన్నులపండువుగా. ప్రాణం నింపుకున్న వనకన్యలా
గాలికి వూగుతూన్న చెట్ల తలలతో
'రారమ్మని' ఆహ్వాన గీతాలు పాడుతూన్నట్లు -
అవే కొండలు. -
భారంగా, బరువుగా,
కదలలేక, ముందుకు అడుగువేయలేక,
విధి క్రూరశాపాన్ని అనుభవిస్తున్న శోకమూర్తిలా,
అవేదన పెల్లుబికిన వేదనామూర్తిలా -
కన్నీటిధారలు కారుస్తూ - శిలయై,
హృదయపు పగుళ్ళు తెచ్చిన అందవికారపు రూపంతో -
శిల్పానికి పనికిరాని వికృతమూర్తియై....
అవే కొండలు.

*****

నేను - ఒక మట్టికణాన్ని.
నవ్వడం నేర్చుకున్నాను.
అందమైన గులాబీపువ్వునయ్యాను.

నేనూ ఒక మట్టికణాన్ని.
నవ్వడం నేర్చుకోలేకపోయాను.
కఠినమైన నల్లని శిలనైయాను.

అదృష్టం అందివచ్చింది.
అందమైన శిల్పి హస్తసంస్పర్శతో రూపం దాల్చాను. వీ
నాకు ప్రాణం పోయలేని నా సృష్టికర్త, చి
తన ఆరాధననీ, అనురాగాన్నీ వ్యక్తం చేసేందుకుకాబోలు క
ఆ గులాబీపువ్వుతో మోకరిల్లాడు. లు

నేనూ ఒక మట్టికణాన్ని. ★
ఏడ్చిఏడ్చి బొంగురుపోయిన గొంతుతో "బొంగు" నయ్యాను. 

"మురళి" నయ్యాను.
వంశీమోహనుని చేతి అలంకారమయ్యాను.
కానీ, నన్ను మ్రోయించేవారేరి ?
ఎన్ని జన్మల నిరీక్షణకు ఈ అదృష్టఫలం లభించిందో ?
అందుకోవడంలో, ఏం పొరబాటు జరిగిపోయిందో ?
ఇప్పుడు చింతించక చేసేదేముంది ?
ఆ ప్రతిమ నిజంగా వంశీమోహనుడైతే, ఎంతో బావుండేది.
యుగయుగాల తరువాత. నా స్వామి అధరస్పర్శచే తరించివుండేదాన్ని

నేనూ ఒక మట్టికణాన్ని,
బాధపడుతూ, బాధపడుతూ.
ఆత్మహత్య చేసుకోబోతున్న భావకవి ఆఖరివుత్తరం అయ్యాను.
అందిన సుఖాలు చెయ్యిజారగా,
అందిరావలసినవి అడవిపాలై,
నిరీక్షతో, నిస్పృహతో అలసిన
ఆర్ద్రహృదయానికి ప్రతిబింబమయ్యాను,
తను, తన కథంతా నాతో చెప్పుకున్నాడు.
చివరికనిపించిందికాబోలు -
ఇదంతా ఎందుకని ? ఎవరికి కావాలని ?
తనంటే ఎవరికి ఇష్టమని ?
జీవితంలో తను ఎవ్వరినీ పరాయివారిగా చూడలేదు.
కానీ ఎవ్వరూ తనను 'తనవారు'గా చేసుకోలేదు.
అందుకని - నన్ను చించిపారవేశాడు.

నేనూ ఒక మట్టికణాన్ని
వీ ఆశలరంగులతో, జీవితచిత్రాన్ని నిర్మించే
చి చిత్రకారుడి నెచ్చెలి నయ్యాను.
క అతను నా సహాయంతో వేయని రూపకల్పనలేదు.
లు చేయని ఊహాకల్పనలేదు.
★ కానీ ఏ చిత్రమూ, ఎన్నడూ పూర్తికాలేదు.
 అన్నీ అలా అర్ధనగ్నంగా నిలిచిపోయాయి.

"మురళి" నయ్యాను.
వంశీమోహనుని చేతి అలంకారమయ్యాను.
కానీ, నన్ను ప్రేమించేవారేరి ?
ఎన్ని జన్మల నిరీక్షణకు ఈ అదృష్టఫలం లభించిందో ?
అందుకోవడంలో, ఏం పొరబాటు జరిగిపోయిందో ?
ఇప్పుడు చింతించక చేసేదేముంది ?
ఆ ప్రతిమ నిజంగా వంశీమోహనుడైతే, ఎంతో బావుండేది.
యుగయుగాల తరువాత. నా స్వామి అధరస్పర్శచే తరించివుండేదాన్ని.

నేనూ ఒక మట్టికణాన్ని.
బాధపడుతూ, బాధపడుతూ.
ఆత్మహత్య చేసుకోబోతున్న భావకవి ఆఖరివుత్తరం అయ్యాను.
అందిన సుఖాలు చెయ్యిజారగా,
అందిరావలసినవి అడవిపాలై,
నిరీక్షతో, నిస్పృహతో అలసిన
ఆర్ద్రహృదయానికి ప్రతిబింబమయ్యాను,
తను, తన కథంతా నాతో చెప్పుకున్నాడు.
చివరికనిపించిందికాబోలు -
ఇదంతా ఎందుకని ? ఎవరికి కావాలని ?
తనంటే ఎవరికి ఇష్టమని ?
జీవితంలో తను ఎవ్వరినీ పరాయివారిగా చూడలేదు.
కానీ ఎవ్వరూ తనను 'తనవారు'గా చేసుకోలేదు.
అందుకని - నన్ను చించిపారవేశాడు.

నేనూ ఒక మట్టికణాన్ని
వి ఆశలరంగులతో, జీవితచిత్రాన్ని నిర్మించే
చి చిత్రకారుడి నెచ్చెలి నయ్యాను.
క అతను నా సహాయంతో వేయని రూపకల్పనలేదు.
లు చేయని ఊహాకల్పనలేదు.
★ కానీ ఏ చిత్రమూ, ఎన్నడూ పూర్తికాలేదు.
 అన్నీ అలా అర్ధనగ్నంగా నిలిచిపోయాయి.

నేనూ ఒక మట్టికణాన్ని.
ప్రేయసి తాంబూలపు పెదవుల ఎరుపు చిరునవ్వునయ్యాను
తన కాటుక కళ్ళలోని, నిరీక్షణలోని ఆతృతనయ్యాను.
ఆడుతున్న గుండెలోని అదలికనయ్యాను.
కదులుతున్న కనురెప్పల అంచుల కాటుకనయ్యాను.
కాటుకకంటి కన్నీరు అయ్యాను.
ఏడ్చి ఎరుపెక్కిన బుగ్గలనయ్యాను.
తరుగక కారిన ధారనయ్యాను.
ఇక ఏడ్వలేక ఇంకిపొయ్యాను.
ఇంకిపోయిన కన్నీటి ధారనయ్యాను.

నేను మట్టికణాన్ని.
సృష్టికి, అనుభూతికి ఆధారాన్ని.
అన్నిటా నేనే వున్నాను.
అన్నీ నాలోనే వుంచుకున్నాను.



## భావాలు — అక్షరాలు — పదాలు.

హిమాలయ శిఖరాగ్రాలకు అందనంత దూరంలో
అంతెత్తున — పరిభ్రమిస్తూవుండే నా భావాలు.
భాషల మూసల్లో పడి, మోనపడి.
పర్వత పాదాల్ని తాకి, తలెత్తుకు పైకి చూడలేక,
అక్కడే ఏరుకుంటాయి,
చెట్లనుండి రాలిన పువ్వులనూ, పళ్ళనూ.

బెదురుతూ బెదురుతూ అల్లుకుంటాయి అక్షరాలు —
అప్పుడే సిగ్గంటే అర్థం చేసుకున్న అమ్మాయి నవ్వులా.
వెన్నెల్లో ఆడుకునే అందమయిన అమ్మాం
వేసవిలో సాయంత్రంపూ

నేనూ ఒక మట్టికణాన్ని.
ప్రేయసి తాంబూలపు పెదవుల ఎరుపు చిరునవ్వునయ్యాను.
తన కాటుక కళ్ళలోని, నిరీక్షణలోని ఆతృతనయ్యాను.
ఆడుతున్న గుండెలోని అదలికనయ్యాను.
కదులుతున్న కనురెప్పల అంచుల కాటుకనయ్యాను.
కాటుకకంటి కన్నీరు అయ్యాను.
ఏడ్చి ఎరుపెక్కిన బుగ్గలనయ్యాను.
తరుగక కారిన ధారనయ్యాను.
ఇక ఏడ్వలేక ఇంకిపోయ్యాను.
ఇంకిపోయిన కన్నీటి ధారనయ్యాను.

నేను మట్టికణాన్ని.
సృష్టికి, అనుభూతికి ఆధారాన్ని.
అన్నిటా నేనే వున్నాను.
అన్నీ నాలోనే వుంచుకున్నాను.



## భావాలు — అక్షరాలు — పదాలు.

హిమాలయ శిఖరాగ్రాలకు అందనంత దూరంలో
అంతెత్తున — పరిభ్రమిస్తూవుండే నా భావాలు.
భాషల మూసల్లో పడి, మోసపడి.
పర్వత పాదాల్ని తాకి, తలెత్తుకు పైకి చూడలేక,
అక్కడే ఏరుకుంటాయి,
చెట్లనుండి రాలిన పువ్వులనూ. పళ్ళనూ.

బెదురుతూ బెదురుతూ అల్లుకుంటాయి అక్షరాలు -
అప్పుడే సిగ్గంటే అర్థం చేసుకున్న అమ్మాయి నవ్వులా.
వెన్నెల్లో ఆడుకునే అందమయిన అమ్మాం
వేసవిలో సాయంత్రంపూ.

లీలగా మనసులో మెదిలో ప్రతిభావంపైనా
పదాల్ని ప్రహరిస్తున్నాను.
పదును హెచ్చి. నునుపు హెచ్చింది గాబోలు.
ఏ భావమూ – ఏ పదాలకూ అందకుండానే జారిపోతోంది.



## మన కథ వినిపించాలని వుంది!

బయటెక్కడో గులాబీ మొక్క
మొగ్గ తొడిగినప్పటి ప్రసవ వేదన,
ఆ మొగ్గ ఒళ్ళు విరుచుకుని
రెక్కలు విప్పుతూన్నప్పుడు వచ్చిన చప్పుడూ.
ఆ విప్పారిన రెక్కలపై మంచు బిందువులు కురుస్తూన్నప్పుడు
వచ్చిన ధ్వనీ – దాని ప్రతిధ్వనీ.
ఆ మంచుబిందువులలో తన ప్రతిరూపాన్ని సరిగ్గా చూదామని
తన కిరణాంగుళులతో సప్తాశ్వరథికుడు
ఆ రెక్కలు సర్దినప్పటి సవ్వడీ –
బహుశః నా కన్నీరు చిందిన చప్పుడునూ. నా సన్నటి విలాపాన్నీ
నీకు వినిపించనివ్వక అడ్డుపడుతున్నాయనుకుంటాను!

పువ్వుల ఊసూ,
కుల ధ్వనీ,
డీ,
గా వినిపించిందో నీకు ?

లీలగా మనసులో మెదిలో ప్రతిభావంపైనా
పదాల్ని ప్రహరిస్తున్నాను.
పదును హెచ్చి. నునుపు హెచ్చింది గాబోలు.
ఏ భావమూ – ఏ పదాలకూ అందకుండానే జారిపోతోంది.



## మన కథ వినిపించాలని వుంది!

బయటెక్కడో గులాబీ మొక్క
మొగ్గ తొడిగినప్పటి ప్రసవ వేదన,
ఆ మొగ్గ ఒళ్ళు విరుచుకుని
రెక్కలు విప్పుతూన్నప్పుడు వచ్చిన చప్పుడూ.
ఆ విప్పారిన రెక్కలపై మంచు బిందువులు కురుస్తూన్నప్పుడు
వచ్చిన ధ్వనీ – దాని ప్రతిధ్వనీ.
ఆ మంచుబిందువులలో తన ప్రతిరూపాన్ని సరిగ్గా చూదామని
తన కిరణాంగుళులతో సప్తాశ్వరథికుడు
ఆ రెక్కలు సర్దినప్పటి సవ్వడీ –
బహుశః నా కన్నీరు చిందిన చప్పుడునూ. నా సన్నటి విలాపాన్నీ
నీకు వినిపించనివ్వక అడ్డుపడుతున్నాయనుకుంటాను!

పువ్వుల ఊసూ,
కుల ధ్వనీ,
డీ,
ంగా వినిపించిందో నీకు ?

## ప్రేమ — పగ

ప్రేమా, పగా —
పన్నీరూ, కన్నీరులా,
విరియని మొగ్గలా, వీడిపోయిన పూరేకుల్లా,
పిండారబోసిన వెన్నెలలా, అమవస నిశిలా,
విరిసిన పూవులా, విసిరికొట్టిన రాయిలా,
నిర్మల ఝరీప్రవాహంలా, ఎండిన సెలయేటి నీటి చారికలా,
వెలుగూ, చీకటిలా,
తెలుపూ, నలుపులా,
వలపూ, వార్ధక్యంలా,
వయస్సూ, వృద్ధాప్యంలా,
కలలా, విరిగిన పాలలా,
కలలా, వాస్తవంలా,
అందక, పొందక,
అర్థంకాక, అందిరాక,
ధృవాల్లా, అధిగమించరాని దూరాల్లా వున్నా,
ఒక్క విషయంలోమాత్రం, ఒక్క స్థాయిలో మాత్రం,
సామీప్యాన్ని పొందడమే కాదు, ఐక్యమై కనబడతాయ్!,

ప్రేమ చేయించే త్యాగాలకు పరిణతి లేదు.
పగ చేయించే కార్యాలకు పరిమితి లేదు.
రెండింట్లోనూ, ఏమాత్రం పొందూ పొందికా లేకపోయినా -
విచక్షణ కందని, ఆలోచనకు తోచని రీతిలో
చేయించే విపరీతాలు, అ విపరీత కార్యాల పరిణామాలూ,
రెండు చోట్లా అసంతృప్తికరంగానే వుంటాయి.
అసమర్థుని ఆత్మసంక్షోభంలా,
చేతకానివాని ఆత్మనివేదనలా వుంటాయి
ప్రేమ చేయించే త్యాగాల ఫలితాల్లు,
ఎంత అసంతృప్తికరంగా వుంటాయో,
పగ చేయించే కార్యాల ఫలితాలూ
అంత నిస్పృహకరంగానే వుంటాయి.
దేవునిలోనూ, దానవునిలోనూ వున్న

# ప్రేమ – పగ

ప్రేమా, పగా –
పన్నీరూ, కన్నీరులా,
విరియని మొగ్గలా, వీడిపోయిన పూరేకుల్లా,
పిండారబోసిన వెన్నెలలా, అమవస నిశిలా,
విరిసిన పూవులా, విసిరికొట్టిన రాయిలా,
నిర్మల ఝరీప్రవాహంలా, ఎండిన సెలయేటి నీటి చారికలా,
వెలుగూ, చీకటిలా,
తెలుపూ, నలుపులా,
వలపూ, వార్ధక్యంలా,
వయస్సూ, వృద్ధాప్యంలా,
కలలా, విరిగిన పాలలా,
కలలా, వాస్తవంలా,
అందక, పొందక,
అర్థంకాక, అందిరాక,
ధృవాల్లా, అధిగమించరాని దూరాల్లా వున్నా,
ఒక్క విషయంలోమాత్రం, ఒక్క స్థాయిలో మాత్రం,
సామీప్యాన్ని పొందడమే కాదు, ఐక్యమై కనబడతాయ్ !,

ప్రేమ చేయించే త్యాగాలకు పరిణతి లేదు.
పగ చేయించే కార్యాలకు పరిమితి లేదు.
రెండింట్లోనూ, ఏమాత్రం పొందూ పొందికా లేకపోయినా –
విచక్షణ కందని, ఆలోచనకు తోచని రీతిలో
చేయించే విపరీతాలు, అ విపరీత కార్యాల పరిణామాలూ,
రెండు చోట్లా అసంతృప్తికరంగానే వుంటాయి.
అసమర్థుని ఆత్మసంక్షోభంలా,
చేతకానివాని ఆత్మనివేదనలా వుంటాయి
ప్రేమ చేయించే త్యాగాల ఫలితాలు,
ఎంత అసంతృప్తికరంగా వుంటాయో,
పగ చేయించే కార్యాల ఫలితాలూ
అంత నిస్పృహకరంగానే వుంటాయి.
దేవునిలోనూ, దానవునిలోనూ వున్న

పరబ్రహ్మ స్వరూప మొక్కటే అంటే అర్థంకాని విషయం
ప్రేమలో, పగలో వున్న సామీప్యం తెలిసివస్తే.....అర్థమయింది నాకు.

## నా నీడ.

నీడ వెదుక్కుంది నా నీడ.
అలసి అలసి..........
ఆవులింతల కౌగిలింతల్లో ఒదిగి ఒదిగి........
నిల్చొని నిద్రపోయింది నా నీడ!
నెమ్మదిగా మాటలు వినిపిస్తున్నాయి
కలువరిస్తోంది నీడ.
"నన్ను నేనుగా తీర్చిదిద్దుకోలేకపోయాను.
నీ రూపమే గానీ, నీ అందం లేదు.
నీ భావమే గానీ, నీ భారం లేదు
నేను నీవే ఐనా....నీవు నేను కాదు
నాకెప్పుడూ నీ గురించిన ఆలోచనలే!
నీ వెప్పుడూ ఆలోచించవు నాసంగతి.
నన్ను నామానాన వదిలేస్తావు.
నీవు ఒద్దికగా నడుస్తూన్నప్పుడు –
రాళ్ళపై, పరాయి వాళ్ళపై -
రోడ్లపై, గొడ్లపై –
పూలమొక్కలపై, మురికి కాల్వలపై నుండి నా పయనం.
నీ వెప్పుడూ ఆలోచించవు నాసంగతి.
లావైనా, సన్నమైనా,
పొడుగైనా, చిన్నవైనా -
నేను నీకేమీ గానట్లు – నీమానాన నీవుంటావు.
వీ నా రూపం తెలుసుకుందామని
చి వెలుతురుకు ఎదురు పోయాను
క వెనక్కు జారిపోయాను.
లు అంతా వెలుతురైతే – నేనెక్కడ ?
★ అంతా చీకటైతే - నేనెక్కడ ?
 ఓరాత్రి నీనుండి పారిపోవాలనిపించింది.

పరబ్రహ్మ స్వరూప మొక్కటే అంటే అర్థంకాని విషయం
ప్రేమలో, పగలో వున్న సామీప్యం తెలిసివస్తే.....అర్థమయింది నాకు.

## నా నీడ.

నీడ వెదుక్కుంది నా నీడ.
అలసి అలసి..................
ఆవులింతల కౌగిలింతల్లో ఒదిగి ఒదిగి.
నిల్చొని నిద్రపోయింది నా నీడ!
నెమ్మదిగా మాటలు వినిపిస్తున్నాయి
కలువరిస్తోంది నీడ.
"నన్ను నేనుగా తీర్చిదిద్దుకోలేకపోయాను.
నీ రూపమే గానీ, నీ అందం లేదు.
నీ భావమే గానీ, నీ భారం లేదు
నేను నీవే ఐనా....నీవు నేను కాదు
నాకెప్పుడూ నీ గురించిన ఆలోచనలే!
నీ వెప్పుడూ ఆలోచించవు నాసంగతి.
నన్ను నామానాన వదిలేస్తావు.
నీవు ఒద్దికగా నడుస్తూన్నప్పుడు –
రాళ్ళపై, పరాయి వాళ్ళపై -
రోడ్లపై, గొడ్లపై –
పూలమొక్కలపై, మురికి కాల్వలపై నుండి నా పయనం.
నీ వెప్పుడూ ఆలోచించవు నాసంగతి.
లావైనా, సన్నమైనా,
పొడుగైనా, చిన్నైనా -
నేను నీకేమీ గానట్లు – నీమానాన నీవుంటావు.
వీ నా రూపం తెలుసుకుందామని
చి వెలుతురుకు ఎదురు పోయాను
క వెనక్కు జారిపోయాను.
లు అంతా వెలుతురైతే – నేనెక్కడ?
★ అంతా చీకటైతే - నేనెక్కడ?
 ఓరాత్రి నీనుండి పారిపోవాలనిపించింది.

చక్రాలపై అతి వేగంగా వెళ్ళిపోదామనిపించింది.
ముందుకు దొర్లడమే కాక
వెనక్కూ దొర్లిపడతాయని
చతురస్రపు చక్రాలను చేసాను.
వాటిని దొర్లించే ప్రయత్నంలో వున్నాను.
నా సంగతేం పట్టనట్లు,
నన్ను నగ్నంగానే వుంచావు.
నీ అందాల్నీ, వికృతాల్నీ దాచుకోవడానికి వేసుకొన్న బట్టలు -
నే వేసుకువి పారిపోలేననిపించింది.
కొత్తరకపు బట్టల్ని నేసాను.
తానంతా పడుగు; పేక లేదు;
పట్టు దొరకని పట్టుపోగులు
జారుడు బండపై నుండి జారినట్టు
జారిన దారపు పోగులు........
నీ జారిన విలువల్ని వెలువరిస్తూ
మరీ నగ్నం చేసిపోయాయి నన్ను.
ఆరాత్రి -
మంచుతోనే చలికాచుకొన్నాను
హృదయం గడ్డకట్టింది
మంచుగడ్డలు నీరయ్యాయి.
మంచు ఆవిరైంది, మనస్సు నీరైంది.
కాలం కలిసిరాలేదు.
ఆనందం అనుభవం కాకమునుపే -
వీడిపోయింది రాత్రి.
నీరు కాకమునుపే —
ఆవిరిగా ఎగిరిపోయింది మంచు."
కసితో అంది.
"కాలరాస్తానుండు; కాలరాస్తానుండు;"
నుదుటి మీది చెమట తుడుచుకుంది నీడ
మరోవైపుకు ఒత్తిగిలి పడుకుంది నీడ

చక్రాలపై అతి వేగంగా వెళ్ళిపోదామనిపించింది.
ముందుకు దొర్లడమే కాక
వెనక్కూ దొర్లిపడతాయని
చతురస్రపు చక్రాలను చేసాను.
వాటిని దొర్లించే ప్రయత్నంలో వున్నాను.
నా సంగతేం పట్టనట్టు,
నన్ను నగ్నంగానే వుంచావు.
నీ అందాల్నీ, వికృతాల్నీ దాచుకోవడానికి వేసుకొన్న బట్టలు -
నే వేసుకువి పారిపోలేననిపించింది.
కొత్తరకపు బట్టల్ని నేసాను.
తానంతా పడుగు ; పేక లేదు ;
పట్టు దొరకని పట్టుపోగులు
జారుడు బండపై నుండి జారినట్టు
జారిన దారపు పోగులు........
నీ జారిన విలువల్ని వెలువరిస్తూ
మరీ నగ్నం చేసిపోయాయి నన్ను.
ఆరాత్రి -
మంచుతోనే చలికాచుకొన్నాను
హృదయం గడ్డకట్టింది
మంచుగడ్డలు నీరయ్యాయి.
మంచు ఆవిరైంది, మనస్సు నీరైంది.
కాలం కలిసిరాలేదు.
ఆనందం అనుభవం కాకమునుపే -
వీడిపోయింది రాత్రి.
నీరు కాకమునుపే –
ఆవిరిగా ఎగిరిపోయింది మంచు."
కసితో అంది.
"కాలరాస్తానుండు ; కాలరాస్తానుండు ;"
నుదుటి మీది చెమట తుడుచుకుంది నీడ
మరోవైపుకు ఒత్తిగిలి పడుకుంది నీడ

కుండల రూపాలు, రంగులు –
మట్టిలో వెదుక్కుంది తాను.
మట్టిలో ఎక్కడివవి ?
మనం పూసిన మైపూతలేనని
తెలిసింది కాదు తనకు.

## కనకాంబరపు రంగు చీర.

సూర్యుడు అప్పుడప్పుడే లేచి, కళ్ళు నులుముకుంటూ చూస్తున్నాడు.
రాత్రంతా తనతోగడిపిన సంధ్య,
తనకెక్కడా అగుపడటంలేదు, చుట్టుప్రక్కల.
తనలో ఇమిడిపోయిందేమోనని, తనవైపే చూసుకున్నాడు.
సంధ్య తన దేహచ్ఛాయనూ,
ఆచ్ఛాదనగా వుండిన కనకాంబరపు చీర రంగునూ,
వంటికి పట్టించినట్టుంది ఆ రాత్రంతా.
పల్చని మబ్బుతునకలతో వళ్ళు రుద్దుకుంటే తప్ప –
రాత్రంతా కురిసి, గడ్డిపరకలపై ముత్యాల అద్దాలు పేర్చిన
హిమబిందువుల్లో – తన తెల్లటి అందాలు చూసుకోలేదు.
తెల్లబోవడం కాదు ; లోకం పాలించాలి కదా !
తెలుపుకు తోడు, వేడి తెచ్చుకోవాలి,
శుచియై, ఉషస్స్పందించనున్న శ్వేతవస్త్రాలు ధరించి,
లోకపాలనం చేయాలి – మళ్ళీ సాయంత్రానికి
కనకాంబరపు రంగు చీరతో సంధ్య సాక్షాత్కరించేవరకూ........



కుండల రూపాలు, రంగులు –
మట్టిలో వెదుక్కుంది తాను.
మట్టిలో ఎక్కడివవి ?
మనం పూసిన మైపూత లేనని
తెలిసింది కాదు తనకు.

## కనకాంబరపు రంగు చీర.

సూర్యుడు అప్పుడప్పుడే లేచి, కళ్ళు నులుముకుంటూ చూస్తున్నాడు.
రాత్రంతా తనతో గడిపిన సంధ్య,
తనకెక్కడా అగుపడటంలేదు, చుట్టుప్రక్కల.
తనలో ఇమిడిపోయిందేమోనని, తనవైపే చూసుకున్నాడు.
సంధ్య తన దేహచ్ఛాయనూ,
ఆచ్ఛాదనగా వుండిన కనకాంబరపు చీర రంగునూ,
వంటికి పట్టించినట్టుంది ఆ రాత్రంతా.
పల్చని మబ్బుతునకలతో వళ్ళు రుద్దుకుంటే తప్ప –
రాత్రంతా కురిసి, గడ్డిపరకలపై ముత్యాల అద్దాలు పేర్చిన
హిమబిందువుల్లో – తన తెల్లటి అందాలు చూసుకోలేడు.
తెల్లబోవడం కాదు ; లోకం పాలించాలి కదా !
తెలుపుకు తోడు, వేడి తెచ్చుకోవాలి,
శుచియై, ఉషస్సందించనున్న శ్వేతవస్త్రాలు ధరించి,
లోకపాలనం చేయాలి – మళ్ళీ సాయింత్రానికి
కనకాంబరపు రంగు చీరతో సంధ్య సాక్షాత్కరించేవరకూ........



# వీచికలు

## కవితా సంకలనం

వెచ్చదనం వుంటేనే
వెలుగ వచ్చుననే సత్యాన్ని చాటింది.
తన కాంతిని పంచియిచ్చింది
తన కాంతిని పంచుకోనిచ్చింది.
వెలుగు కోసమే వెలిగింది. — కృష్ణమూర్తి

జీవితపు సోపానాల మధ్యభాగాననిలచి
గడచిన అనుభవాలని నూతనం చేసుకుంటున్నాను
జ్ఞాపకాల బూజుతెరలని తొలగిస్తున్నాను
ఈ సృష్టికి అర్ధమేమిటో వెతుక్కుంటున్నాను
ఈ కల్పనకి కారణం కనిపించటంలేదు
జీవితానికీ—తర్కానికీ లంగరందటంలేదు. — చక్రవర్తి

మేడమీంచి కనబడే
కొబ్బరిచెట్టు మట్టల మధ్యల్లో
చంద్రుడు విలువ తగ్గిన రూపాయిలా
వెలవెల బోతున్నాడు. – పోనూ మరి !
పక్షానికో మారొచ్చే అమావాస్య పక్షంచేరిన
ఈదేశం..........జ్యోత్స్నను జోకొట్టేసింది. — వెంకట్రావు

హిమాలయ శిఖరాగ్రాలకు అందనంత దూరంలో
అంతెత్తున – పరిభ్రమిస్తూ వుండే నా భావాలు
భాషల మూసల్లోపడి, మోసపడి,
పర్వత పాదాల్ని తాకి తలెత్తుకు పైకిచూడలేక
అక్కడే ఏరుకుంటాయి
చెట్లనుండి రాలిన పువ్వులనూ, పళ్లనూ. — విశ్వనాథం